# BALA
# BHAKTHULU.

( For the use of schools )



*Approved for school use.*
*(Vide Fort St. George Gazette,*
*dated 14-4-1931 Page 268.)*

BY

Avancha Venkataratnam.

శ్రీరామ.

# బాలభక్తులు.



ఇది

పాఠశాలల యుపయోగార్థమై

## ఆవంత్స వేంకటరత్నముచే

రచియింపఁబడి, ప్రకటింపఁబడియె.



మూఁడవకూర్పు

శ్రీవిద్వజ్జన మనోరంజనీ ముద్రాక్షరశాల,

పిఠాపురము.

**1932.**

 [వెల రు **0-10-0.**

# మూఁడవకూర్పు.



సోదరులారా !

ఇంతత్వరితముగ నీ " బాలభక్తులు " మూఁడవకూర్పు ముద్రింపఁబడుటకుఁ గల కారణము—ఈగ్రంథమును దమతమ పాఠశాలలలోఁ బఠనీయగ్రంథముగ నేర్పాటుచేయుచున్న పాఠశాలాధికారుల ప్రోత్సాహమేయని, మనవిచేయుచు వారికి నా కృతజ్ఞతాపూర్వక వందనముల నర్పించుచున్నాను.

ఇట్లు

విధేయుఁడు,

ఆమంత్స వేంకటరత్నము,

గ్రంథకర్త.

# విషయసూచిక.



| విషయము. | | | పుట. |
|---|---|---|---|
| 1. ప్రహ్లాదుఁడు | ... | ... | 1 |
| 2. ధ్రువుఁడు | ... | ... | 32 |
| 3. మార్కండేయుఁడు | ... | ... | 51 |
| 4. నందుఁడు | ... | ... | 69 |



శ్రీరామ.

# బాలభక్తులు

## 1. ప్రహ్లాదుఁడు.

శ్రీహరిమందిరమున జయవిజయులనువారలు ద్వారపాలకులుగనుండ, నొకనాఁడు బ్రహ్మమానసపుత్రులైన సనక సనందనులు దిగంబరులై శ్రీమన్నారాయణుని దర్శింపవచ్చి హరిమందిరముం బ్రవేశింప ననుజ్ఞ వేఁడిరి. కాని, యావిప్రార్భకు లెవ్వరో వారిమహిమ లెట్టివో, జయవిజయు లించుకంతయు నెఱుఁగక వారలను లోనికిఁబోనీయక నాటంకపఱచిరి. అంత నబ్బాలకు లలిగి, "ఓరీ! కఠినాత్ములారా! దీనజనబాంధవుఁడును ననంతకళ్యాణగుణుండు నై విరాజిల్లు, లక్ష్మీపతి సన్నిధి కరుగు మమ్ముల మదోన్మత్తులై నాటంకపఱచుటకు సాహసించిన మీర లసురులై జన్మింపుఁడ' ని శపించిరి.

అంతట వా రాశాపమునఁ బదభ్రష్టులై మొఱలిడిన, సనకసనందనులు కరుణార్ద్రహృదయులై మూఁడుజన్మములలో వైరానుబంధమున భగవత్సన్నిధానంబు గలిగెదరని నిర్దేశించి తమలోకమునకుఁ జనిరి. అట్లు శాపహతులైన జయవిజయులు తొలిజన్మంబున హిరణ్యకశిపు హిరణ్యాక్షులుగను, రెండవ భవంబున రావణకుంభకర్ణులుగను, తృతీయజన్మంబున శిశుపాల దంతవక్త్రులుగను నుద్భవించిరి.

కమలోదరుఁడు వరాహరూపంబున సోదరుఁడగు హిరణ్యాక్షునిఁ బరిమార్చినదాది, హిరణ్యకశిపుఁ డుగ్రుఁడై ప్రళయకాలరుద్రునిచందంబున మండిపడుచు, మహాప్రభాయుతం బగు శూలంబుఁ గేల ధరించి, సభామంటపమున నిలువంబడి, త్రిమస్తక త్రిలోచన శకుని శంబర శతబాహు నముచి హయగ్రీవపులోమ విప్రచిత్తి ప్రముఖులైన దానవుల నాలోకించి

శా. నాకుం దమ్ముఁడు మీకు నెచ్చెలి రణ◆న్యాయైకదక్షుండు బా
హాకుంఠీకృతదేవయక్షుఁడు హిర◆ణ్యాక్షుండు వానిన్ మహా
సౌకర్యాంగముఁ దాల్చి దానవవధూ◆సౌకర్యముల్ నీఱుగా
వైకుంఠుండు వధించిపోయెనఁట యీ◆వార్తాస్థితిన్ వింటిరే.

చ. వనములనుండుఁ జొచ్చుమునివర్గములో వలఘోణిగాఁడునం
జనన మొంకుఁగ రెవ్వరును◆ జాడ యొకింతయులేదు తన్నుడా
సిన మఱిదాయు వెంటఁబడి◆ చిక్కకచిక్కఁడు వీనినొక్కకీ
లున మనమెల్ల లోఁబడక◆ లోఁబడఁ బట్టుకొనంగవచ్చునే.

సీ. భుజశక్తి నాతోడఁ ♦ బోరాడ శంకించి
మున్నీట మునిఁగిన ♦ మునుఁగుఁగాక
యలయించి పెనఁగునా ♦ యచల సంభ్రమమున
కెఱఁగి వెన్నిచ్చిన ♦ నిచ్చుఁగాక
జగడంబు సైఁపక ♦ సాత్త్విక్య కాంక్షియై
యిలక్రింద నీఁగిన ♦ నీఁగుఁగాక
క్రోధించి యేఁగుఁగాక ♦ కొంతపౌరుషమున
. హరిభంగి వడరిన ♦ వడరుఁగాక

ఆ. వె. కఠిన శూలధారఁ ♦ గంఠంబు విదళించి
వాని శోణితమున ♦ వాఁడిమెఱసి
మత్సహోదరునకు ♦ మహితతర్పణము సేసి
మెఱసి వత్తు మీకు ♦ మేలు దెత్తు.

కావున మీరు భూతలంబెల్లఁ జరించి శ్రీహరిని వెదకుఁడు. ఏయెచోట్ల దేవబ్రాహ్మణభక్తి తేజరిల్లునో, యజ్ఞము లెచ్చట నిర్వర్తింపఁబడునో, వర్ణాశ్రమధర్మము లెచట వృద్ధి నందుచుండునో, విష్ణుమూర్తి యుండెల్ల నుండునని చెప్పుదురు. పలుమాటలేల ? అతఁడే యజ్ఞము. అతఁడే వేదము. సమస్త భూదేవక్రియలకు నాతఁడే మూలము. ధర్మములకెల్ల నాతఁడే యాధారము. కాఁబట్టి మీర లాయానెలవులనెల్ల ధ్వంసము చేసి మీప్రభావములం జూపిరండ"ని నిర్దేశించిన, దివిజమర్ద నులు ఋత్విక్కుల శిరముల ధరియించి, పెక్కురు రక్షోవీరులు ప్ర

శాలలనెల్లఁ బాధాపరించి, మునిజనంబుల తపోధ్యానవిశేషము
లడుగంటఁజేసి సాధు గోబ్రాహ్మణసంఘంబుల హింసించి,
లోకములఁ బాధాపరింపఁదొడఁగిరి. అంత నమరులు ప్రాణ
రక్షణమునకై యరణ్యమే శరణ్యమని పరుగులిడఁజొచ్చిరి.

హిరణ్యకశిపుఁడు తన రాజ్యము నమాత్యసత్తముల
కొప్పఁజెప్పి, పూర్ణగర్భవతియైన భార్య లీలావతి నింటదిగవిడచి
వారిని సాధింప సమశక్తి పద్మసంభవుఁగూర్చి తపంబు సల్పి,
గొప్ప వరంబులు వడసివచ్చుటకు మందరాద్రి కరిగెను. హిరణ్య
కశిపుఁ డూరఁ లేఁడుకదాయని దేవేంద్రుఁడు దానవేంద్రుని
రాజధానిపైకి దాడి వెడలివచ్చి, యంతఃపురమునన్నున్న లీలా
వతినిఁ జెఱవట్టి పోవుచుండెను. తన్ను విడువుమని లీలావతి
మహేంద్రుని ననేకవిధముల బతిమాలెను గాని ప్రయోజనము
లేకపోయెను.

అంత లీలావతి యాత్మసంరక్షణార్థము పెద్దపెట్టున నఱవ
నయ్యార్తనాదము దేవర్షిపుంగవుఁడగు నారదమునీంద్రుఁ డాలిం
చి వచ్చి, " బిడౌజా! నీవెఱుంగని ధర్మములు లేవు. సాధ్వియగు
నీమెను హరించుట ధర్మముకాదు గాన నిమ్మానిని విడుమ"న
నేల్పులదొర ,, దేవర్షిపుంగవా! ఈయబల భర్త యెట్టి జగ
ద్ద్రోహియో నీ వెఱుంగనిదికాదు. ఇప్పుడీమె గర్భవతియై
యున్నది. ఈమెకుఁబుట్టు పుత్రుఁ డెంతటి క్రూరుఁడై లోక
ముల బాధించునోయని నేనీమెను గొనిపోవుచుంటిని. ఈమె

ప్రసవించునంతవఱకు నాయొద్ద నిడుఁగాని జనించినకుమారుని
వధించి యీమెను విడిచెద"నని ప్రత్యుత్తరమొసంగెను. అంత
నారదుఁడు "సురేంద్రా! ఎంతపొరపడితివి? ఈకాంతాగర్భ
మునందున్న యర్భకుఁడు యుష్మాదృశులచేఁ గడతేరవలసినవాఁ
డు కాఁడు. వాఁడు నిరుపమాన భగవద్భక్తి ధురంధరుఁడు.
కావున నీ వీకార్యమును విరమింపఁజేయుమ"న సునాసీరుఁ
డామెను విడచెను.

అప్పుడు దేవముని లీలావతితో "నీపతి తపోగరిష్ఠుఁడై
పద్మభవునివలన వరములఁ బడసివచ్చును. అంతదనుక నీవు నా
యాశ్రమమున నుండుము. నీ కభీష్టమును గలుగఁజేయును.
నీకు జనింపనున్నవాఁడు పరమభాగవతోత్తముఁడ"ని పలికి,
యమ్మగువను నిజాశ్రమంబునకుఁ గొనిపోయి, పతివ్రతాభావం
బునఁ బోషించుచుఁ దత్త్వోపదేశముఁ జేయుచుండెను. నారదుఁ
డు నాటిన జ్ఞానబీజములు లీలావతి గర్భమునందున్న డింభకుని
యందుఁబడ, ఆకుమారుఁడు జగదుద్ధారకమగు తారకమంత్ర
రాజమును గర్భకుహరమునందే యభ్యసించుచుండెను.

మందరాచలమున ఘోరతపమాచరించుచున్న దైత్యే
శ్వరునివృత్తాంత మెల్లరకు విశదమాయెను. జగములెల్ల సంచ
లించునట్లు తన దివ్యతేజము నల్దెసలఁ బ్రసరింపఁజేయుచు హి
రణ్యకశిపుఁడు తపస్సియందుఁ బూనియుండెను. అతని దారుణ
తపఃప్రభావమునకుఁ గులగిరులతో ధరణీతలంబదరఁజొచ్చెను.

సప్తసాగరములును సంచలింపఁదొడంగెను. తారాబృందము రాలఁజొచ్చెను. లోకమెల్ల నతని తపోగ్నిచే మలమల మాడుచుండెను.

నిలింపులు దీనికారణ మరయఁగోరి పితామహుని సందర్శించి యంజలులు ఘటించి "దేవా! లోకంబు లొక్కపెట్టున సంచలించుచుండుట చూచియుండలేదా? అసురనాయకుని తపోగ్నికి సహింపఁజాలక నాకమువిడిచి నీతో మనవిసేయ నిట్లరుదెంచితిమి. కావున నాతని తపంబును వారించి రక్షింపకున్న మేమిఁక నిలువఁజాలము"ని విన్నవింప, నా కంజజుఁడు వారినెల్లర భయమొందవలదని చెప్పి పంపి, మందరాద్రికి త్వరితగతి వచ్చి యందు నియమయుక్తుండై నా, పిపీలికావృత మేదోమాంసచర్మగాత్రుండును, వల్మీక తృణ వేణుపటల పరివృతుండును నిరుపమానతపఃప్రభావుండును నై నివసించియున్న నిర్జరారాతిం జూచి, "ఓనిశాచరాగ్రణీ! నీవలె నిట్టి యుగ్రతప మింతకుమున్నెవ్వరుఁ జేయలేదు. అన్నపానీయములెల్లక నూఱు దివ్యసంవత్సరములు శరీరమున నెవ్వ రసువుల నిలువఁగలరు? నీతపంబున కే నెంతయు మెచ్చితిని. నీమనోభీష్టములెల్లం దీర్చెదలెమ్ము"ని పలికి వనమ్ము కాపిపీలికాభక్షితంబైన రక్షోవల్లభుని కాయంబుమీఁదఁ గమండలూదకంబులు ప్రోక్షించెను.

అంత నద్దానవభర్త కమలాననకరకమల దివ్యామోఘ

కమండలూదక ధారాబిందుసందోహ సంసిక్త సకలాంగుండై
తెలివొంది కన్నులు దెఱచి, తపంబు విరమింపఁ జేసి చుట్టును ప్ర
మ్ముకొనిన వల్మీకతృణవేణు పటలంబునుండి, వజ్రసంకాశ
దేహుండును సువర్ణవర్ణుండును భానుతేజోవిరాజమానుఁడును
నై వెలువడివచ్చి, వాగ్దేవీమనోనేతకు సాష్టాంగదండప్రణామ
ము లాచరించి యంజలిఁ జేసి, హంసవాహనునిమీఁద దృష్టినిడి,
„ దేవా ! నీవు లోకంబులనెల్లఁ గల్పించు మహానుభావుఁడవు.
ఆద్యంతరహితుఁడవై సచ్చిదానందస్వరూపమవై జగన్నిర్మాత
వై ప్రజ్వలించు తేజోమూర్తివి. మహామహిముఁడవగు నీకిదె
నమస్కరించువాఁడను. నా యభీప్సితములఁ దీర్పఁ బూనితివేని,

శా. గాలింగుంభిని నగ్నినంబువుల నాకాశస్థలిన్ దిక్కులన్
రేలన్ ఘస్రములం దమఃప్రభల భూరిగ్రాహరక్షోమృగ
వ్యాళాదిత్యనరాదిజంతుకలహవ్యాప్తిన్ సమస్తాస్త్రశ
స్త్రాళిన్ మృత్యువులేని జీవనము లోకాధీశ యిప్పింపవే.

మఱియును సంగరంబులందు నా కెదురులేని శౌర్యంబు
ను, లోకపాలుర నతిక్రమించు నద్భుతమహిమయును, భువన
త్రయవిజయంబును గటాక్షింపుము''ని వేఁడ నతని తపంబునకు
మెచ్చి దుర్లభంబులైన వరంబులెల్ల నిచ్చి విరించి „ దైత్యేం
ద్ర ! నీయర్థించినవెల్ల నొసంగితిని. ఇట్టివరంబు లెవ్వరును
గోరరు. కోరిన నొసంగను. నీవు నన్నుఁ దపంబున మెప్పించిన

కాలంబున దుర్లభంబులైన నీ యీవరముల నిచ్చితిని, కావున శేముషీసింధుడవై దేశకాలముల నెఱిఁగి సుమతివై వర్తింపుమని పలికి, యరవిందసంభవుం డంతర్ధానంబుఁ జెందెను.

నిలింపారాతి బయలువెడలి నిజపురమున కరిగెను. నారదాశ్రమమున నున్న లీలావతియు నాసమయమున కమ్మునీశ్వరునివలన నా వాసముఁ జేర్పఁబడెను. హంసవాహనుని యమోఘ వరపరంపరలచే నసురవల్లభుఁడు మహాదర్పమున మండిపడుచు, సహోదరునిఁ గాలునిపాలికంపిన శ్రీపతిని బగిమార్తునని పూనియుండెను. విష్ణువాయానెలవులలో నుండునని యెంచి, గోభూసుర మునిబృందముల ఖేదంబులు జెందర వందలయగుమాడ్కిఁ గోలాహలముఁ జేయ నమకట్టుచు దిక్పాలుర దిశాంతములకుఁ దఱుముచు ముల్లోకముల నల్లకల్లోలము సేయుచుండెను.

అదానవుఁ డేసమయమున నెవ్వనిపై దండెత్తునో యెవ్వరిప్రాణములకుఁ గీడుమూఁడునోయని, లోకపాలకులు నిరంతరము భయమందుచుండిరి. యజ్ఞహవిర్భాగంబు లమరుల కందనీయక, తానే గైకొనుచు సకలలోకములకును హిరణ్యకశిపుఁడే రాజై యుండెను. ఇవ్విధంబుగఁ బెద్దకాలంబు పరిపాలింప బృందారకు లెల్లరును మహావిష్ణువు నాశ్రయింప, నంత శ్రీహరి

మ. భయముం జెందకుఁడయ్య విప్రవరుల్
భద్రంబు మీకయ్యెడున్
జయముం గాంచము భూతసంతతికి మ
త్సందర్శన ప్రాప్తిన
వ్యయమై చేరు నిజంబుగన్ దితిసుత
వ్యాపారభాషావిప
ర్యయముల్ గాలముగూడెఁ జంపెదఁ జనుం
డిందాఁక మీ గోత్రవర్గ.

ఆ. వె. శుద్ధసాధులందు • సురలందు శ్రుతులందు
గోవులందు విప్రకోటియందు
ధర్మపదవియందు • దిరిలినాయందు వాఁ
డెన్నఁడలుగునాఁడె • హింసనొందు."

ఇదియునుంగాక శివకన్నకొడుకగు ప్రహ్లాదుని వాఁ డె
న్నఁడు రోషంబున నాపన్నునినొందించునో, యానాఁడే యాసు
పర్వారాతిని వధింతునని యానతిచ్చెను, నిలింపులు మొక్కి
రక్కసుఁడు మరణించుట నిక్కమని సంతసించి తమతమ దిక్కు
లకుం జనిరి.

హిరణ్యకశిపునకుఁ బ్రహ్లాదుఁడు, అనుహ్లాదుఁడు, సం
హ్లాదుఁడు, హ్లాదుఁడు ననునలువురుపుత్రు లుద్భవించిరి.

సీ. తనయందు సకలభూ • తములందు నొకభంగి
సమహితత్వంబున • జరగువాఁడు

పెద్దలఁ బొడగన్న భృత్యునికైవడిఁ
జేరి నమస్కృతుల్ సేయువాఁడు
కన్నుదోయికి నన్యకాంత లడ్డంబైన
మాతృభావన సేసి మరలువాఁడు
తల్లిదండ్రులభంగి ధర్మవత్సలతను
దీనులఁ గావఁ జింతించువాఁడు

తే. గీ. సఖులయెడ సోదరస్థితి జరపువాఁడు
దైవతములంచు గురువులఁ దలఁచువాఁడు
లీలలందును బొంకులు లేనివాఁడు
లలిత మర్యాదుఁడైన ప్రహ్లాదుఁడధిప.

మరియు నతఁడు మిగుల రూపవంతుఁడయ్యును కులీనుఁడయ్యును గర్వశూన్యుఁడు. అతఁడు నిరంతర హరిభజనము తప్ప నన్య మెఱుంగఁడు. సద్గుణములెల్ల నక్కుమారునియందు చేరినవని చెప్పవచ్చును.

సీ. శ్రీవల్లభుఁడు దన్నుఁ జేరిన యట్టైనఁ
జెలికాండ్ర నెవ్వరిఁ జేరమనుచు
నమరారి తనమ్రోల నాడినయట్టైన
నమరభాలుర్ణతోఁడ నాదమనుచు
భక్తవత్సలుఁడు సంభావించినట్టైన
బహుభాషలక్షీవమాను పలుకమనుచు

సురవంద్యుఁ డనలోనఁ • జూచినయట్టి వ
శోక్తి సమస్తంబుఁ • గాదనుచును

తే. గీ. హరిపదాంభోజయుగచింత • నామృతమున
నంతరంగంబు నిండిన • ట్టి వరుఁడు
నిత్యపరిపూర్ణుఁ డగుచు సం • న్నియును మఱచి
జడతిలేకయు నుండును • జడునిభంగి.

నిదురవోవునప్పుడైనను భుజించునప్పుడైనను పరులతో సంభాషించునప్పుడైనను నిద్రించునప్పుడైనను తోడివారలతో నాటలాడు సమయమందైనను, వాఁడు హరినామచింతనము విడువక మైమఱచుచుండును. ఒకసమయమున లక్ష్మీవల్లభుఁడు తనతో భాషించినట్లు ముదమందును. మఱియొకప్పుడు హరిం బాడుచు నవ్వి గంతులువైచును. ఒక్కొక్కప్పుడు తనలోఁ దాన మాటలాడుకొని నవ్వును. వేఱొండురీతి శ్రీహరి పాద పద్మయుగళీచింతామృతాస్వాదనంబానుఁడై నిమీలితనేత్రుఁడై యూరకుండును.

ఆహా! ఎంతటియద్భుతము! డింభకుఁడైన ప్రహ్లాదుని యుల్ల మొకప్పుడును చలింపదే! ఎట్టి నిశ్చలభక్తి! ఎంతసుజ్ఞానము! అబ్బాలభక్తుఁడౌ నరాకృతిఁ దాల్చినభక్తియో యన భాసిల్లుచుండెనుగదా!

ఇట్లు పవిత్రమగుఁ గాలముఁ బుచ్చుచు హరిభక్తి మూర్తీభవించిన తెఱంగుననున్న ప్రహ్లాదునిచందము రక్షో

వల్లభునకు వెలిపడదలయ్యెను. విద్యావ్యాసంగములేమియే కుమా
రుఁ డిట్లుండుటకు హేతువని తలఁచి "కుమారా! విద్యావి
హీనుఁడు జ్ఞానశూన్యుఁడు. ఎంతభద్రముగ గుప్తపఱచినను
ధనము చోరుల పాలగుచుండును గాని విద్య నెవ్వరుం దస్క
రింపలేరు. విద్య నరులకు విత్తభోగముల నిచ్చుటయే కాక,
సత్కీర్తిని గూడ గల్గించును. విద్యావంతుఁ డెల్లరచేతను పూ
జింపఁబడును. విద్యాహీనుని జీవనము నిరర్థకము కాకయుండును.
కావున మనకులగురువులగు వీరిచే నీవు సకలశాస్త్రము లభ్యసింపు
మ"ని పలికి, శుక్రాచార్యుని కొడుకులగు చండామార్కుల
రావించి కుమారుని వారికప్పగించి, యితనికి విద్యగఱపి నీతి
కోవిదునిగఁ జేయుఁడని యానతిచ్చెను. దానవభర్త యాజ్ఞాను
సారము వారు బాలునిఁ గొనిపోయి యతనికి సహపాఠులఁ
గొందఱఁ గూర్చి పెక్కుశాస్త్రములఁ గఱపిరి. గురువు లెట్లు
చెప్పిన నట్లే పలుకునుగాని, ప్రహ్లాదుఁ డావిద్యలు నిష్ప్రయో
జనములని యెంచుకొనియు నాక్షేపింప సాగెను.

కుమారుఁ డెట్టివిద్యావంతుఁడయ్యెనో యరయఁగోరి,
యొకనాఁడు హిరణ్యకశిపుఁడు కుమారునిఁ దోడ్కొనిరండని
వారల కాజ్ఞాపించెను. వేత్రహస్తులచే నాహూయమానులై
ప్రహ్లాదుఁడును గురుపుత్త్రులును రక్షోవల్లభుఁ డాసీనుఁడై
యున్న సౌధాంతరసీమఁ బ్రవేశించిరి. అంతఁ దండ్రి కుమారునిఁ
జేరఁదీసి తొడలపై నిడుకొని, "కుమారా! నీకు గురువులేవిద్యఁ

గఱపిరి ? ఏయేశాస్త్రము లభ్యసించితివి ? నీ కెయ్యది భద్రమై యున్నది ? తనయుల ముద్దుపల్కు లాలించి తండ్రు లానంద సాగరమున నోలలాడుచుందురు. కావున నీమృదుమధుర భాషణంబుల నావీనులకు విందొనరింపుమ"ని పలికిన జనకునకుఁ బ్రియనందనుఁడు

"ఉ. ఎల్ల శరీరధారులకు • నిల్లను చీకటి నూతిలోపలం
ద్రెళ్లక మీరు మేమను మతిభ్రమణంబున భిన్నులై ప్రవ
ర్తిల్లక సర్వమున్ సతిని • దివ్యకళామయమంచు విష్ణునం
దుల్లముఁ జేర్చి కారడవి • నుండుట మేలు నిశాచరాగ్రణీ."

యని పలికెను.

కుమారుఁడాడిన ప్రతిపక్షానురూపంబులగు పలుకులు చెవులకు ములుకులై తోఁప దానవేంద్రుఁడు "తనయా! ఏమిది! ఐదేండ్లప్రాయముగల బాలుఁడవే! ఎవ రెట్లుపలికిన శిశువు లట్లు పలుకుదురుగదా! శత్రుపక్షములగు నిప్పలుకులు నీ కెవరుబోధించిరి ? గురుపుత్రులే యిట్లుపదేశించిరా ? మనకు పరమవిరోధియైన శ్రీవిష్ణువును నీవు కీర్తించుట ? నీవు నాకు సుతుండవై యుందులకు సురలను సురాధిపతులను రణంబున నిర్జింపవలయును. యక్ష కిన్నర గంధర్వ విహంగనాగపతులను నాశనము గావింపవలయును గాని, విష్ణువు నెంతమాత్రమును స్మరింపరాద"ని పలికెను.

ప్రహ్లాదుఁ డంతట గురువులవీక్షించి ,, మహాత్ములు గొందఱు, సేమమీరను యజ్ఞానమునఁబడి, జగద్రక్షకుఁడును, సుజనవత్సలుఁడును, పరమాత్ముఁడును, కరుణాపయోనిధియు నగు శ్రీహరినిఁ గనుఁగొనఁజాలకున్నారు. నిశ్చలజ్ఞానసంపన్నులు తక్క లాఁతివారలు లక్ష్మీనాధుని దర్శింపనేర్తురే!

సీ. మందారమకరంద • మాధుర్యమునదేలు
మధుపంబువోవునే • మదనములకు
నిర్మలమందాకినీవీచికలఁదూఁగు
రాయంచచనునె త•రంగిణులకు
లలితరసాలప•ల్లవఖాదియై చొక్కు
కోయిల సేరునే • కుటజములకుఁ
పూర్ణేందుచంద్రికా•స్ఫురిత చకోరక
మరుగునె సాంద్రనీ•హారములకు
తే. గీ. అంబుజోదర దివ్యపా•దారవింద
చింతనామృతపానవి•శేషమత్త
చిత్త మేరీతి నితరంబుఁ • జేరనేర్చు
• వినుతగుణశీల మాటలు • వేయునేల ?
అని పలికెను.

పురోహితకుమారు · లావలను లాలించి, ,, ఏడేండ్ల యర్భకుఁడవు, నీచరిత్ర మద్భుతంబుగ నున్నది. మాచెప్పిన

శాస్త్రములం దొకటియుఁ బలుకక తర్కవాక్యములు మాత్ర
ము భాషింపుచుంటివి. విశ్వవిఖ్యాతమగు నీ దైత్యవంశవృక్ష
మునకు వేరుపుర్వుభంగి నీ వెక్కడ యుద్భవించితివని పలికి,
"దానవేంద్రా! ఈపాపని మరలఁ జదివించి నీతికుశలునిఁ
గావించి తోడ్కొనివత్తుము" అని హిరణ్యకశిపునితోఁ జెప్పి
ప్రహ్లాదునిఁ గొంపోయిరి.

పిదప వానికి నీతిశాస్త్రములఁ గొన్నింటిని నేర్పి గురు
పుత్రులు ప్రహ్లాదుని హిరణ్యకశిపుని సన్నిధికిఁ దోడితెచ్చిరి.
అంత, దండప్రణామము నాచరించియున్న కొమరునిఁ దండ్రి
తన యంకపీఠమున నధివసింపఁజేసి, "కుమారా! ఇంతకాలము
గురువులయొద్ద నభ్యసించిన శాస్త్రములలో నీ కేయేవిద్యలు
కరగతములైనవో యొకపద్యమును జదివి తాత్పర్యము నాకెఱిం
గించి నావీనులకు విందొనరింపుము" అనఁ, బ్రహ్లాదుఁడు "జనకా!
గురువులు సకలశాస్త్రము లెఱింగించిరి. చదువులలోఁ గలమర్మ
మెల్లఁ దెలిసికొంటిని. అంధునికాదర్శముఁ జూపినను బధిరుని
చెంతఁ గంబువునూఁదినను నెంతప్రయోజనమో హరిభక్తి
శూన్యునిబ్రదుకంతప్రయోజనము. శ్రీ రమణీశ్వరుని
సరసీరుహనేత్రుని సర్వలోకవిఖ్యాతచరిత్రుని వాసుదేవుని
నిశ్చలభక్తితో భజించుటకంటె యన్యమేమిఁ గలదు?

మ. తనుహృద్భాషలసఖ్యమున్ శ్రవణమున్
దాసత్వమున్ వందనా

ర్చనముల్ సేవయు నాత్మలో నెఱుకయున్
సంకీర్తనల్ చింతనం
బను నీతొమ్మిది భక్తిమార్గముల స
ర్వాత్మున్ హరిన్ నమ్మి స
జ్జనుఁడై యుండుట భద్రమంచుఁ దలఁతున్
సత్యంబు దైత్యోత్తమా.

సీ. కమలాక్షు నర్చించు • కరములు కరములు
శ్రీనాథు వర్ణించు • జిహ్వ జిహ్వ
సురరక్షకుని జూచు • చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు • శిరము శిరము
విష్ణు నాకర్ణించు • వీనులు వీనులు
మధువైరిఁ దవిలిన • మనము మనము
భగవంతు వలగొను • పదములు పదములు
పురుషోత్తమునిమీఁది • బుద్ధి బుద్ధి
తే. గీ. దేవదేవునిఁ జింతించు • దినము దినము
చక్రహస్తునిఁ బ్రకటించు • చదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడి • గురుఁడు గురుఁడు
తండ్రి హరిఁ జేరుమనియెడి • తండ్రి తండ్రి.

సీ. కంజాక్షునకుఁ గాని • కాయంబు కాయమే
పవనకుంభిత చర్మ • భస్త్రి గాక

వైకుంఠుఁ బొగడని • వక్త్రంబు వక్త్రమే
ఢమఢమధ్వనితోడి • ఢక్కగాక
హరిపూజనములేని • హస్తంబు హస్తమే
తరుశాఖనిర్మిత • దర్విగాక
కమలేశుఁ జూడని • కన్నులు కన్నులే
తనుకుడ్యజాల రం•ధ్రములుగాక

ఆ. వె. చక్రిచింతలేని • జన్మంబు జన్మమే
తరళసలిల బుద్బు•దంబుగాక
విష్ణుభక్తిలేని • విబుధుండు విబుధుఁడే
పాదయుగముతోడి • పశువుగాక.

సీ. సంసారజీమూత • సంఘంబువిచ్చునే
చక్రిదాస్య ప్రభం•జనములేక
తాపత్రయాభీల • దావాగ్నులాఱునే
విష్ణుసేవామృత • వృష్టిలేక
సర్వంకషాఘౌఘ • జలరాసులింకునే
హరిమనీషా బడ•బాగ్నిలేక
ఘనవిపద్గాఢాంధ•కారంబు లడఁగునే
పద్మాక్షునుతిరవి • ప్రభలులేక
తే. గీ. నిరుపమాపునరావృత్తి • నిష్కళంక
ముక్తినిధిఁ గానవచ్చునే • ముఖ్యమైన

భాగ్గ్యోదంతచింత నాంబుజనములేక
కామునగుర్వునైన నో దానవేంద్ర."

అని పలికెను.

జ్వరపీడితున కిట్టి మధురపదార్థ మొసంగినను విషతుల్య మగుపట్టులు, దానవేంద్రుండగు హిరణ్యకశిపునకు బాలభక్తుండగు ప్రహ్లాదుని వచనామృత మిసుమంతయు రుచింపక, నిశాత శూలములై కర్ణరంధ్రములఁ దాఁకిన, దిరినుతుఁ దాజ్యమువోసిన యనలంబువోలె మండిపడుచుఁ గోపరక్తలోచనుండై పటపటఁ బండ్లుకొఱుకుచు గురుపుత్రులతో, "ఈ బాలుని నీతివిద్యా పారంగతునిఁ జేసెదమని చెప్పి, వానికర్హముగాని విరోధిశాస్త్రము లెఱింగించి స్వామిద్రోహముఁ జేయనెంచిరా? తిన్న యింటి వాసములు లెక్కవెట్టఁ జూచుచుంటిరా? గురువులని నమ్మి నందులకుఁ దగినట్లు చేసిరి" యని నుడువ, గురువులు "దైత్యేంద్రా! మీకృపకుం బాత్రులమైన మేము మీపుత్రునకు విరోధికథనంబు లెఱింగింతుమా? ఇదియంతయు భగవత్కటాక్షమున నైజమనీషయేకాని యొరు లెఱింగించినది కాదు. ఒకవేళ నెఱింగించినను వినువాఁడు గాఁ"డనిరి.

అంత దనుజాధినాథుండు, శత్రుదుర్నిరీక్ష పరాక్రముం డగు తన సన్నిధానమున నెంతటివైచిత్ర్యము ఉద్భవించుచున్నదని పెద్దయుంబ్రొద్దు చింతించి, భయంకర కోపవిఘూర్ణమానలోచనుండై ప్రహ్లాదునితో, "ఓరీ! కులువా! ఇదేటి

నీతిరా! గురువు లెక్కింపని యీబుద్ధులు నీ కెవ్వరుబోధించి
రో పేర్కొను"మనఁ దండ్రికిఁ బ్రహ్లాదుఁడు,

"ఉ. అచ్చపుఁ జీకటింబడి గృహవ్రతులై విషయప్రవిష్టులై
చచ్చుచుఁ బుట్టుచున్ మరలఁ • జర్వితచర్వణులైనవారికిం
జెచ్చెరఁబుట్టునే పరులు • సెప్పిననైన నిజేచ్ఛనైన నే
మిచ్చిననైనఁ గానలకు • నేగిననైన హరిప్రబోధముల్."

యని ప్రత్యుత్తర మొసంగెను.

అంత రక్కసులతేఁడు కుమారుని ధిక్కరించి తొడలపై నుండి నేలఁ గ్రోధోద్దీపితమానసుండై వేఁడిచూపుల మంటలు మింటికెగయ నమాత్యులతో, క్రోడమై పినతండ్రి యసువులఁ బాపిన యాచెనటియగు హరిపైఁ గ్రోధంబుఁ బూనక, వానికి బంటుక్రియ భక్తుఁడై నాతో వైరముపట్టిన యిట్టి జనకద్రోహి నెందైనఁగంటిరే? కులద్రోహిని యీ కొనవయసుపాపిఁ జంపించి, నావంశమునకుఁ గళంకము రాకుండఁ గాపాడుకొనుఁడి. వీఁడు రక్షింప నసమర్థుఁడు గాన వీనిని మీ రిచ్చవచ్చిన భంగి వధించి రండని భటుల కాజ్ఞాపించెను.

కటకటా! కాలమహిమ! పసిబాలుని, విష్ణుభక్తిప్రభావిశాలుని, సుగుణాకరుని, సుకుమారుని, సుందరాకారుని, సర్వలోక పవిత్రచారిత్రుని, నంత మొందింపఁ గన్నతండ్రియే సాహసించెనే!

కఠినహృదయులకు ఘోరకృత్యములొనర్చుటన్న మహా నందముగాఁబోలును! వెంటనే వెడఁగురక్కసులు పెక్కుండ్రు దనుజకులాలంకారుని గ్రుద్దుచు, శూలధారలచేఁ బడవ్రేయుచు వాయురంధ్రముల బిగఁబట్టుచు, గదలతో మొత్తుచుఁ గరవాలములచే హింసించుచు, మదకరీంద్రములచే మట్టించుచు, మహాకాకోదరశ్రేణులచేఁ గఱపించుచు, దావానలములోనికి విసరుచు, మహార్ణవమునఁ బడఁద్రోయుచు, విషముఁ ద్రావించుచు, గండశిలల నువ్వించుచుఁ, పర్వతశిఖరములనుండి దొర్లించుచు, గాఢశరపరంపరలచే హింసించుచు, నెండలందును వానలందును నిలువఁబెట్టుచు, నుర్విఁ బాఁతుచు, నాహారపానీయముల నాటంకపఱచుచు, బహువిధచిత్రవధోపాయములఁ గావించిరి.

అహో! వారివి కర్కశహృదయములుగాకున్న నా హరిపాదసరోరుహచింతనక్రియాలోలుని, బాలుని, గొట్టుటకు వారికరంబు లాడునా! అక్కటా! సకలలోకపూజ్యుఁడని యూహింపక, సద్గుణనిధియని తలఁపక బాలుఁడనియైననెంచక, తమమగంటిమినెల్లఁ బ్రహ్లాదునిఁ గొట్టుటయందుపయోగించిన వారెంత యవివేకులు! ఎంతక్రూరులు! ఎంతపాతకులు!

కాని, రాజశాసనములు గఠినశిక్షలును నిశ్చలహరిభక్తి దీక్షాపరుల బాధించునే! వారెంతబాధించుచున్నను బాలుఁ డేమాత్రమును చలింపఁడాయెను! మత్కుణంబును నలిపినట్లు

నలిపినను ప్రహ్లాదునిశరీరము నలుఁగలేదు. శోణితమైనఁ జిమ్మ లేదు. శల్యములు చూర్ణములుకాలేదు. దీనభావమైనఁ బొడ చూపలేదు. వెఱచి యతఁడు దిక్కులకుం బాఱలేదు. ఆప్త బంధులఁ జీరలేదు. తండ్రిని దూఱలేదు. కన్నతల్లినైనఁ బిలువ లేదు. కన్నులనీరు దేలేదు. హృద్మములోపల మెఱసెడు పావన మూర్తికరణిఁ బ్రకాశించుచు నునిశ్చలభక్తిని శ్రీహరినిమాత్ర ము మాటిమాటి కోపన్నగశాయీ! యోదనుజభంజన! యో జగదీశ! యోమహాపన్నశరణ్య! యోనిఖిలపావన! యని నుతించుచు వాసుదేవస్మరణ ప్రభావమున వెలుఁగొందుచుండెఁ గాని, లేశమైన క్లేశమునొందఁడు. అహా! అజగదీశభక్తుని, యాబాల భక్తాగ్రేసరుని, యయ్యనఘుని భక్తిప్రభావ మెంత విచిత్రము! ఎంత సుచిపాత్రము!

తానొనరించిన మారణోపాయములన్నియు వ్యర్థములగుటచే నసురనాయకుఁడు భయాద్భుత విషాదసాగరంబుల మునింగి,

ఉ. ముంచితివార్ధులం గదలఁద్రొక్కితి శైలతటంబులందుఁద్రో
బ్బించితిశస్త్రరాజిఁ బొడిపించితి మీఁదనిభేంద్రపంక్తిఁ ద్రొ
క్కించితి దిక్కరించితి శపించితి ఘోరదవాగ్నులందుఁద్రో
యించితిఁ బెక్కుపాట్లవలయించితిఁ జావఁడిదేమిచిత్రమో.

చ. ఎఱుఁగఁడు జీవనోపథము లెవ్వరు భర్తలులేరు బాధలం
దరలఁడునైజతేజమునఁ దత్యముజాడ్యములేదుమిక్కిలిన

మెఱయుచునున్నవాఁ డొకఁడి • మేషము దైన్యమునొందఁ
డింక నే
తెలుఁగున దుఃఖించువేసరి • దివ్యము వీనిప్రభావ మెట్టిదో.

అక్కటా! వీఁడనన్యసామాన్యప్రభావసంపన్నుఁడగుట సాధునిరోధము నన్నే బాధించుననుట కావంతయు సందియము లేదు. ఏమిచేయుదునని విషణ్ణచిత్తుఁడై తలపోయు రజనిచరేంద్రునితోఁ జండామార్కులు విచారింపవలదనియు వానికి గృహస్థాశ్రమము లుపదేశించి యెట్లయిన సత్పథంబులోనికి గొనివత్తుమనియుఁ బలికి, ప్రహ్లాదునిఁ గొంపోయి త్రివర్గముల బోధింపఁ బ్రారంభించిరి.

గురువు లింటలేనియెడమునఁ బ్రహ్లాదుఁడు తోడి బాలకులతో, "మిత్రులారా! కర్మబంధములనుగురించి నిరంతరము మన గురువు లజ్ఞేపనిగ నుపదేశించు విద్యవలన, మన కావంతయుఁ బ్రయోజనములేదు. అస్థిరములగు దారపుత్త్రాదుల యందును, ధనకనకవస్తువాహనతతియందును మోహంబును జనింపఁజేయు బోధనముల నెన్నఁడును మన మాలింపరాదు. మానవజన్మము లభించుట మిగుల దుర్లభము. మఱియందు బుద్ధిమంతుఁడై జననమొందుట కష్టము. మానవుఁడు శతవర్షపరిమితమైన జీవితకాలమందర్ధము, నిద్రాదివ్యవహారములలోను, మిగిలినదానిలో వింశతిహాయనంబులు బాల్యకౌమారప్రాయములం దాటపాటలందును కామవికారములందును, దక్కిన

ముప్పదియుద్ధంబులు, గామ క్రోధ లోభ మోహ మద మత్సరం
బులను పాశంబులం గట్టువడి, కళత్రమని శిశువులని భాగ్యమని
భోగ్యమని యిల్లని వాకిలియని ముక్తిమార్గమును గానక, స్వ
యంకృతకర్మబద్ధుండై యంధకారమహాసాగరమునంబడి ము
నుంగుచేకాని, యొకనాఁడును నిశ్చలభక్తిని భగవంతుని స్మరిం
పఁడు. చిన్నతనముననే భక్తిజ్ఞానము లలవడవలయును. కమల
నాభుని భజనంబువలన మోక్షము కరతలామలకమగునుఁడీ!
కర్మానుసారంబుగ సంభవించు కావడికుండలవంటి సమానము
లగు సుఖదుఃఖములను పాటింపక, బుద్ధిసాగరులు ముక్తిమార్గ
మునే వెదకుచుందురు. బుద్బుదంబులభంగి నీకాయ మనిత్య
మగుటచే పరీక్షిత్తుమొదలు ఘనవంశనివహము లెల్లరును మృ
త్యువువాతఁ బడవలసినవారలే! ప్రాణము పోయినపిదపఁ గూడ
వచ్చునది యేదియు లేదుగాని, మనమాచరించిన మంచిచెడ్డలే
స్థిరములై నిలుచును. కాఁబట్టి నైహికవాంఛలను వీడి హరి
స్మరణముఁ జేయుటయే ముక్తిసాధనము. నిర్మలమైనభక్తి
యొక్కటియే భగవంతుని మెప్పించునుగాని, యైశ్వర్యము
సౌందర్యము పరాక్రమమున్నగునవేవియును మెప్పింపలేవు.
ఎట్టి యవస్థలైనను దేహమునకేగాని నిత్యమైనదియును నిర్మల
మైనదియును నగు నాత్మకుమాత్రము లేవు. అజ్ఞానమునకుఁ
బుట్టినిల్లయి మోహమునకు మూలమైయొప్పు తుచ్ఛసంసార
సాగరంబును దాఁటించినవాఁడే యాత్మజ్ఞాని," యని బోధించి

కానొక్కఁడే హరిభక్తుఁడగుటకాక, వారినందఱ నారాయణ
చరణారవింద సేవాపరాయణులఁ గావింపఁదొడఁగెను.

అప్పాలకుని నిరుపమానవిజ్ఞానమునకుఁ దోడిబాలు
రబ్బురపడి, 'సుగుణాకరా! మనమెల్లరము భార్గవకుమారుల
యొద్దనే శాస్త్రములన్నియు నభ్యసించితిమి. మనకు వేఱొక
గురువు లేఁడు. నీవును గురుకులవాసము తప్ప నన్యమెఱుంగవు.
చంటివాఁడవగు నీజనకునియనుజ్ఞ లేక త్రినేత్రుఁడై నమజార
పరశక్యంబైన నీరాజబోధముఁ బ్రవేశించి, యేమహోదారచారి
త్రుఁడు నీకీసద్బుద్ధి బోధించెనో'న ప్రహ్లాదుఁడు, తన పూర్వ
వృత్తాంతమును సాంతముగ వివరించి నారదమంత్రోపదేశ
క్రమంబును విశదపఱచెను. నాఁటినుండియు నబ్బాలురు గురూప
దిష్టశాస్త్రములను విడనాడి గురువచనములఁ దిరస్కరింప
మొదలిడిరి.

ప్రహ్లాదుఁడు రక్షోబాలుర చిత్తములెల్ల మోహాయత్త
ములం జేసినాఁడనియు, వారలు తమ బోధనముల నొల్లక
విష్ణుగాథలనే స్మరించుచుండిరనియుఁ దమ్ము కుహనాగురువులని
నిందించుచున్నారనియుఁ బ్రహ్లాదునిఁ జదివించుట దుస్సాధ్య
మనియు శుక్రనందనులు శక్రవైరితో సభక్తికముగ విన్న
వించిరి.

అంతట నాయురాంతకారాతి దండశూకితభుజంగము
క్రియ మండిపడుచు, భీమరోషకషాయితనేత్రుఁడై నిజపుత్రు

మారణోద్యోగమున నుద్యోగించుచుఁ గుమారునితో "ఓరీ కులద్రోహీ! ఇంద్రాదిదేవతలే మదీయాజ్ఞోల్లంఘనముఁ జేయ నోడుచుండ నిన్నెవ్వరు రక్షింతురురా? నేను రోషావేశమున నున్న ముల్లోకము లల్లకల్లోలములగును. నాయనుజ్ఞలేకున్న మింటనాదిత్యుఁడు ప్రకాశింప వెఱచును. వాయువు వీవ భయపడును. అనలము మండుటకు జంకును. యముఁడు ప్రాణులఁ జంపనోడును. వీరలే యిట్లుండ నిఁక లాఁతివారిమాట వేఱ నుడువనేల? విష్ణువను జగన్నాథుఁడంటివి. నాకంటె లోకాధీశుఁ డెవఁడురా? మాటిమాటికి వైకుంఠుని బ్రశంసించుచుఁ గంఠశోషముఁ జెందనేల? వైకుంఠుండు వీరవ్రతుఁడేని నేనమర వీరుల హింసించునాఁడు రణరంగమున కేలరాలేదు? జీవితముపై నాశ గలదేని చిత్తమున శ్రీహరితలంపుఁ గలనైన నిలువకుము. సకలదిక్కులను నేను గెలిచితి నిఁక నీకు దిక్కెవ్వరు? మహాబలులనందఱను జయించిన బలవంతుండ నేనుండ నీ వెవ్వరి బలమున నీ యిచ్ఛవచ్చినకరణిఁ జరుపుచుంటివి" అనెను.

అందులకుఁ బ్రహ్లాదుఁడు మెల్లన వినయంబున "తండ్రీ! ఇందులకు సందియమేల? బలవంతులకును బలహీనులకును నీకును నాకును బ్రహ్మలకును ప్రాణులకును నెవ్వఁడు బలమో యావిభుఁడే నాకును బలము. సకలదిక్కులకును మూలమగు శ్రీమహావిష్ణువే నాకును దిక్కు. జనులలో నీకెదురు చెప్పువా రెవ్వరును లేరని గర్వించుట వెఱ్ఱితనము. నిన్నెల్ల

ప్రీతి నాశ్రయించుకొనియున్నవారలు, నీయపరాధములను నీ సన్నిధినిఁ జెప్పవెఱచి సంతమాత్రమున నీవు ఘనుఁడవని తలఁపరాదు. ముఖస్తుతుల కుబ్బక సత్యాసత్యముల మదినెఱిఁగి ధర్మాధర్మముల గ్రహించి వర్తింపుము. లోకములన్నిటిని జయించిన నీవు, దృఢపాశముల నిన్ను బద్ధునిఁ జేయు నీలోపలి యరిషడ్వర్గమును నిర్జింపలేకుంటివి. ఇఁకనైన నిష్కామవృత్తిని శ్రీహరిని భజింపుమ"ని పలికిన పుత్త్రునిపలుకులు జనకునికిఁ గ్రోధమును హెచ్చించినవి. పరమభాగవతాగ్రేసరుఁడగు ప్రహ్లాదునిఁ గాంచి నిశాచరవిభుఁడు "ఓరీ డింభకా! అవివేకుఁడవై మూర్ఖచిత్తమున నాతోఁ బ్రతిభాషలాడుచుంటివి. విష్ణువు విష్ణువని నీవు వాయదర వాఁగువాఁ డెచ్చటనుండెను రా? లోకములెల్లను గలయవెదకినను గానరాఁడే?" యన హరికింకరుఁడు లేశమైన శంకింపక, హర్షపులకాంకుర సంకలిత విగ్రహుండై

॥ మ. కలఁడంభోధిగలండు గాలిఁ గలఁడా
కాశంబునం గుంభినిం
గలఁడగ్నిన్ దిశలం బగళ్ల నిశలన్
ఖద్యోత చంద్రాత్మలం
గలఁ డోంకారమునం ద్రిమూర్తులఁ ద్రిలిం
గవ్యక్తులం దంతటం

కలఁ డీశుండు గలండు తండ్రి వెదకం
గానేల యీయాయెడన్.

క. ఇందుఁగలఁ డందు లేఁడని
సందేహమువలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకిచూచిన
నందందే కలఁడు దానవాగ్రణి వింటే."

యనిపలుక, భగవంతుఁడు సర్వవ్యాపియను దృఢవిశ్వాసముగ
నున్న హరిభక్తునిపలుకులు నిక్కమని ప్రకటించుటకో యన,
శ్రీవల్లభుఁడు నృసింహాకృతుని యచ్చటి స్థావరజంగమ వస్తు
జాలములం దుద్దండప్రభావంబుతో నిమిడియుండెను.

హిరణ్యకశిపుఁడు సింహాసనమునుండి దిగి యొఱనుండి
కరవాల మూడఁబెఱికి జడిపించుచు "ఓరీ! సర్వవ్యాపకుఁడైన
విష్ణువు నీస్తంభమునఁ జూపఁగలవా!" యనఁ బ్రహ్లాదుఁడు
"పిపీలికాదిబ్రహ్మపర్యంతము నిండియుండు భగవంతుఁ డీ
స్తంభమునందుమాత్ర మేల యుండఁడ"ని బదులుచెప్పెను.
అంత రాక్షసేశ్వరుఁడు తోఁకఁద్రొక్కిన త్రాఁచువోలె మండి
పడుచు సభామంటపస్తంభమును మహాసంరంభమున దనహస్త
మున వ్రేసెను. అంత నాస్తంభమునుండి, ప్రళయకాలరుద్రా
కృతి నరసింహాకృతిదాల్చి దుష్టశిక్షణ శిష్టరక్షణపరాయణుం
డగు శ్రీమహావిష్ణు వావిర్భవించెను.

కడుచిత్రముగ నుద్భవించిన యానరకేసరిఁ గాంచి యా తఁడు తన్ను వధింప నవతరించిన మహావిష్ణువే కాని మఱియొకఁడు కాఁడని హిరణ్యకశిపుఁడు దృఢనిశ్చయుఁడాయెను. అయినను వానిఁ ద్రుటిలోఁ ద్రుంచెదనని యయ్యసదృశమూర్తి యగు నరసింహమూర్తిఁ జేరఁబోయెను. అంత నమ్మహావిష్ణువు హిరణ్యకశిపునిఁ దన యూరుభాగమునఁ జేర్చి, నఖాగ్రంబుల నుదరంబును వ్రచ్చి రుధిరమును నేలఁ గాల్పుచు, నాంత్రములఁ గంఠమాలికలుగా ధరించి విజృంభింపఁ దొడంగెను.

పద్మసంభవుఁడు ప్రసాదించిన వరములకు భంగముఁ గలుగనీక, నరుఁడును మృగమును గాని నరసింహాకృతిని రాత్రియుం బగలునుగాని సంధ్యాసమయమున నంతరంగమును బహిరంగమునుగాని సభాద్వారమున, మిన్నును మన్నునుగాని యూరుమధ్యమునఁ జేతనాసహితంబులును చేతనారహితంబులునుగాని నఖంబుల, రక్షోవల్లభుని లక్ష్మీవల్లభుఁడు వధించెను. ఆయుధంబు లెత్తుకొని, తత్తరంబున రణంబునకు సిద్ధమైన పెక్కురక్కసులఁ, జక్రాయుధాది సాధనంబుల నంతమొందించెను. అప్పు డమరులు కుసుమవృష్టిఁ గురియించిరి. గంధర్వులు గానముఁ జేసిరి. అప్సరసలు నృత్యము సల్పిరి. దేవతావిమానములతో గగనమెల్ల నిండియుండెను. భేరీమృదంగాదివాద్యరవమెల్ల దిక్కుల నల్లుకొనెను.

పరకటువ పర్వోత్సాహులై దేవగణంబులెల్లఁ జను

డించెను. బ్రహ్మాదిదేవతలు నరసింహమూర్తిని వేర్వేఱ స్తుతించిరి. ఆభీకరమూర్తిని శాంతిపఱుప నెవరికిని శక్యము కాకుండెను. తుదకు శ్రీపతికి నలవిగాకుంటచే వారిజసంభవుని పంపునఁ బ్రహ్లాదుఁడే యందులకు సిద్ధమాయెను. ప్రహ్లాదుఁడు ముకుళితకరకమలుఁడై నమస్కరించుచు, "దేవా! అమరులు సిద్ధులు సంయమీంద్రులు బ్రహ్మాదులు నీప్రభావమును వర్ణింపఁజాలరు. అట్టియెడ నేను రక్షోవంశసంభవుఁడను, బాలుఁడను, మూర్ఖుఁడను నిన్నెట్లు స్తుతింపనేర్తును? తపము వంశము సౌందర్యమాదిగాఁగల వెవ్వియును భక్తి కీడుగావు కదా! సునిశ్చలభక్తి యొక్కటియే తప్ప శౌర్య ధైర్య బల పరాక్రమము లెవ్వియు నిన్ను మెప్పింపఁజాలవు. దానధర్మాది సద్గుణసంపన్నుఁడయ్యును, గర్వముగల ధాత్రీసురోత్తముని కంటె నిర్మలభక్తితో నిన్నుఁగొల్చు శ్వపచుఁడు మేలు. పరమ కరుణాస్వరూపుఁడవగు నీ కెల్లరును సములు. త్రికరణశుద్ధిగా నిన్ను భజించువాఁ డెట్టివాఁడైనను ముక్తినొందక మానఁడు. భక్తుఁడన్న నీకుఁ బరమప్రీతిగదా! నీకు హానిసల్పిన నోర్తువు గాని నీభక్తుని హింసించిన శాంతివహింపవు. సర్వదా నిన్ను భజించు బ్రహ్మాదిదేవతలు భవదీయ భయంకరస్వరూపముఁ గాంచి భీతిల్లుచున్నారు. లోకభయంకరంబగు నీనరసింహాకృతినిఁ గాంచి నే వెఱవనుగాని, ఘోరక్రూరమగు దుర్భరసంసార మహాంబుధికిమాత్రము భయపడెదను. లోకములను కా

ధించిన దూరింద్రిని, సర్వజనానందమగునటుల సంహరించుటం జేసి నీవవతరించితివని తెలిసెను. ఇంక నలుకవిడచి శాంతివహింపుము. తల్లివైనను, తండ్రివైనను, గురుఁడవైనను, సఖుఁడవైనను నాకన్నియును నీవే. మహాత్ముఁడవైన నీ లీలావతార కథావిశేషంబులఁ బఠించుచు, నీచరణదాసులగు భక్తులఁ జేరియుందును. సర్వశక్తుఁడవును, సర్వేశుఁడవును, సర్వరక్షకుఁడవును నగు నీ సంపూర్ణప్రేమతప్ప మఱియొండు వాంఛింపను. దుష్టశిక్షణ శిష్టరక్షణంబులు నీ కవశ్యకర్తవ్యంబులగుటం జేసి, యధర్మము ప్రబలునసమయమున నీవవతరించి లోకములఁ గాపాడుదువుగదా! నిరంతరంబు నీకు నమస్కరింపఁడేని నీ పవిత్రనామమును స్మరింపఁడేని నీచరణకమలసేవ నొనరింపఁడేని నీకథావళి వీనులార వినఁడేని యెంతవాఁడైనను భవబాధా విముక్తిఁ జెందలేఁడు. కాఁబట్టి నన్ను భవదీయచరణదాసునిం జేయుము" అని పలువిధంబులఁ బ్రార్థించుచున్న ప్రహ్లాదుని, భక్తజనబాంధవుఁడగు నారాయణుండు కరుణాయత్తచిత్తుఁడై, మంగళప్రశస్తంబగు తనహస్తమున మస్తకమంటి శాంతమునఁ, "పరమపవిత్రుఁడవగు నీకెల్లప్పుడును మంగళమగుఁగాక! నీ మనోరథములెల్ల నిచ్చెదను. నీవణుమాత్రమును జింతింపకుము. నాదర్శనమొనరించిన ప్రాణికోటికి పునర్జన్మములేదు. లోకమున భక్తులు నన్నుఁ బొంది యభీప్సితముల ననుగ్రహింపుమని ప్రార్థింతురు. నీవును వలయునభీప్సితముల నడుగుము" అనెను.

ప్రహ్లాదుఁడు ,,దేవా! దేవరసంపూర్ణానుగ్రహమునకు నేను పాత్రుఁడనైతిని. నాయెడఁ గృపకలదేని నాయందు సకలకామంబులు నణఁగియుండునటు లనుగ్రహింపుము. తత్కారణమున దివ్యమగు నీరూపమును దర్శించెదన''ని వినయమునఁ బలికెను. అందులకు భగవానుఁడు ,, కుమారా! నీ భువనమ్ఘానము లోకసంస్తవనీయము. నీశరీరమును బరిత్యజించి దివ్యకాయుఁడవై నన్నుఁ జేరెదవు. మద్భక్తులు కామక్రోధాదివివర్జితులై సదా భజించుకతంబున వారినెల్లర నే నుద్ధరింతును. వారి వలన దుర్జనులుగూడఁ బవిత్రులగుదురు. నీతండ్రి కుత్తర క్రియల నిర్వర్తించి పితౄణంబును దీర్చుకొనుము. నాచే చ డియుటవలన నాతనికి ముక్తి సుకరము''ని పలికి, బ్రహ్మాదిదేవతలంగూడి నిజలోకమున కరిగెను.

అనంతరము ప్రహ్లాదుఁడు సర్వజనపూజ్యంబుగ రాజ్యమేలి, భగవదాదేశమునఁ దుదకు విష్ణుసాయుజ్యపదవి నధిష్ఠించెను. ప్రహ్లాదునివంటి బాలభక్తుని, నిరంతర సత్యవ్రతదీక్షాపరుని, సహజ సంవర్ధమాన నిరంతర ధ్యానరతుని, పవిత్రచరితామృతంబుఁ గ్రోలి, సద్గుణగరిష్ఠులై, భక్తియుక్తులై, ధర్మనిరతులై వర్తింపఁగోరు విద్యార్థిలోక మెంతయు ధన్యమైనది. ఈపావనచరిత్ర నెవ్వరైన నిశ్చలభక్తితో విన్నను, పఠించినను నిర్భయలోకంబును జేరుదురు.

ప్రహ్లాదచరిత్ర సంపూర్ణము.



శ్రీరామ.

# బాలభక్తులు.



## ౨. ధ్రువుఁడు.



వనజజనకుద్భవించిన స్వాయంభువమనువునకు, శతరూపవలన నుత్తానపాదుఁడును ప్రియవ్రతుఁడును నను నిరువురు పుత్రు లుదయించిరి. ఉత్తానపాదుఁడు పావనచరిత్రుఁడు. అయ్యనఘుఁడు సునీతి సురుచియను నిర్వురువనితల నుద్వాహమాడి, ధ్రువుఁడు, నుత్తముఁడు నను నిరువురుకుమారులఁ బడసెను. అద్ధరాతలేంద్రుఁడు ధరామండలంబును సకలజనమనోరంజనంబుగఁ బాలించుచున్నను, కళత్రములయెడమాత్రము సమానభావము వహింపక, రెండవభార్యయగు సురుచితోడిదే లోకమని యామెయెడ మిగులఁ గూరిమిఁగలిగి మెలఁగుచుండెను. సునీతియు ధ్రువుఁడు నావరపాలుని యనురాగమునకుఁ బాత్రులు కారైరి.

ఒకనాఁ డుత్తానపాదుఁడు సురుచిమందిరమున నుత్తముని
దన యుత్సంగాగ్రమునఁ గూరుచుండఁజేసి, యుపలాలనము
సేయుచు సురుచిఁగూడి వినోదలీలలఁ దేలిఁగూడుచుండెను.
అంత సచ్చోటికిఁ సునీతితనయుండగు ధ్రువుఁడువచ్చి తండ్రి
యంకమెక్కుట కుత్సాహపూరితమానసుఁడై జనకుని సమీ
పించెను. కాని, తండ్రి కుమారునాదరింపక నుపేక్షవహింపఁ
జెంతనున్న సురుచి గర్వించి, "ధ్రువా! నీసంభ్రమహేతు వే
నెఱుఁగుదు. జనకుని యూరుభాగమున నుపవసింపఁగోరితివేని
నాగర్భముననే జనించియుండుదువు. సవతిగర్భమున నుద్భవిం
చిన నిర్భాగ్యునకు జనకునియంకముపై నెక్కుభాగ్యమెట్లుంగి
సంభవించును? నీకట్టిమనోరథము గట్టిగనుండెనేని భగవంతు
నాశ్రయించుము. కృపాసింధుఁడగు పద్మాక్షుఁడు మరల నిన్ను
వేఱొకజన్మమున నాయుదరంబునఁ బుట్టించును" అని దయాహీ
నయై పలికెను.

విగ్రమాత్సర్యమై పలికిన పినతల్లివాక్యములు ధ్రువుని చెవు
లకు ములుకులయ్యెను. అట్టిపలుకులు జనకుఁ డాలించియు
సహించి యూరకుండుట ధ్రువునిచిత్తమును మఱింతదుఃఖసాగ
రమున ముంచివైచెను. అభిమానధనుఁడగు నబ్బాలుఁడు
తోఁకఁద్రొక్కిన త్రాఁచువలె రోషకలితుఁడై చేయునదిలేక
పెద్దపెట్టున రోదనముఁగావించుచుఁ దల్లియగు సునీతిదగ్గఱ
కేగెను.

కుమారుని దుఃఖకారణ మింతకుమున్నె దాసీజనముల
చే వినియుండుటచే, సునీతియు విచారించుచుఁ దనయునొడిలో
నిడుకొని మోమునిమురుచుఁ జుబుకంబుఁ బుణుకుచు, ,, నాయ
నా! మనము దుఃఖింపఁబనిలేదు. పూర్వజన్మకర్మ మెవ్వరికైన
ననుభవింపకతప్పదు. నీవుదురదృష్టవంతుఁడవగుటచేఁగదా భర్త
చే నికృష్టదాసిగానైనఁ బరిగణింపఁబడని నిర్భాగ్యురాలనగు
నాకుక్షి నుదయించితివి! నీపినతల్లివచనంబులు సత్యంబులే
యగును. నీ వింకను జనకుని యంకభాగముపై వసియింపఁ
గాంక్షకలదేని సురుచి యాజ్ఞానుసారము హరిపాదము లాశ్ర
యింపుము. దాన సకలశుభంబు లొనఁగూడుటయే కాక నీ
మనోభీష్టములు సిద్ధించును. అనంతకళ్యాణగుణపరిపూర్ణుఁడగు
భగవానుఁ డార్తజనరక్షకుఁడగుటఁ జేసి, యాతని సేవించుటచేత
నే పద్మసంభవుఁడు బ్రహ్మపదంబును, మీ తాతమనువు నిర
వధికయాగఫలంబుల ననుభవించి ప్రఖ్యాతయశులైరి. కావున
నీవును భక్తజనమందారుఁడగు నారమాకాంతుని పాదపంకేరు
హంబుల మదినిల్పి సేవింపుము. నీకు శుభంబగుఁగావుత" మని
యాశీర్వదించెను.

ధ్రువుఁడు జననివాక్యరత్నములందు గుదినిల్పి జగన్నా
టకసూత్రధారుని ధ్యానంబునకుఁ జనుచుండ, మార్గమధ్యమున
దేవర్షిపుంగవుండగు నారదుఁ డెదురాయెను. చతుర్దశభువన
సంచారియుఁ ద్రికాలవేదియు నగునమ్ముని, ధ్రువునివృత్తాంత

మంతయు దివ్యదృష్టి నెఱింగి, ,, రాజార్భకా ! ఎందుల కీసాహా
సము ? నిత్యలక్ష్మీనివాసమై తనరు నావాసమునువదలి యేకాకి
వై కాంతారములవసించి శ్రమలఁబడనేల ? పసివాఁడవగు నీకు
మానావమానములతోఁ బనియేమి ? నిష్కాములై సమాధి
నిష్ఠలనుండు నిశ్చలచిత్తులైన యోగీంద్రబృందమేని యందగా
రాని ముకుందునే క్రియఁబొందఁగలవు ? ఇది నీకెంతయుఁ గష్ట
సాధ్యమునుమా ! సుఖదుఃఖములు దైవవశమునఁ గలుగుచుం
డును. సుఖమునకు ముదమందక దుఃఖమునకు వగవుఁజెందక
వర్తించువాఁడే విమలవిజ్ఞాని. కావున, నీవు విచారముడిగి వెను
కకు మరలి గృహమునకుఁ జనుమ''ని పలికెను.

ధ్రువుఁడు స్థిరమతియై, ,, మునికులతిలకా ! ఉత్తమ
క్షత్రియవంశసంజాతుఁడనగునేను, పినతల్లియాడిన దుర్భాషా
ఘనశరములచే వేదననొందుటకంటె, భగవద్ధ్యానమునఁ గాం
తారమున వసించి శ్రమలకోర్చిన మేలుగాదా ? బ్రహ్మమా
నసపుత్రుఁడవును మహామహిమాస్పదుఁడవునగు నీవు, నాయు
ద్యమము నెఱవేఱు సాధనమెఱిఁగించుట కర్తవ్యముగాని నా
కిట్లు పిఱికితనమును నేర్పుట న్యాయమా ? భగవద్భక్తి యల
వడుటకుఁ జిన్న పెద్ద తారతమ్యములతోఁ బనిలేదుకదా ! కావు
నఁ బరమేశ్వరునిఁ బ్రసన్నునిగాఁ జేసికొనుట కనువగు నుపాయ
మెఱిఁగించి నన్నుఁ గృతార్థునిఁ జేయుము''ని భక్తివినయములఁ
బలుకఁ దోడనే నారదుఁ డాశ్చర్యహర్షరసములు ముప్పిరిఁగొనఁ

కరుణార్ద్రహృదయుఁడై, ‘‘కుమారా! తపస్సాచార్యశిక్షా
నాతిశయంబులు మిగులఁ గష్టసాధ్యములు. లోకనాథుఁడగు భగ
వంతుఁడే నీయందుఁ గరుణాయత్తచిత్తుఁడై నీకీయుత్తమోప
దేశముఁ గావించెను. కాకున్న నీ వింతటి దృఢచిత్తుఁడవై యుం
డవు. నారాయణపాదారవిందధ్యానమకరందరసాస్వాదనమునఁ
గాని నీమది శాంతిఁ బొందదు. నీవు యమునానదీతీరముననున్న
మధువనంబున కేఁగి, యాశైవలినీపావననీరంబుల స్నాతుండవై
హరిపదధ్యానరతచిత్తుఁడ వగుము. పసిబాలుఁడ వగుటం జేసి నీవు
వేదాధ్యయనాదికర్మల కర్హుఁడవు గావు. అయినను గుణార్జనం
బుల సంపాదించి ధ్యానపరాయణుఁడవు గమ్ము. పురుషోత్తముని
దివ్యమంగళవిగ్రహ మొక్కపరి చిత్తమున హత్తెనేని మరల
నెడఁబాయఁగనేరదు. ప్రణవయుక్తంబును ద్వాదశాక్షరకలితంబు
నగు వాసుదేవమంత్రమును, సప్తవాసరములు పఠించినంతమా
త్రమున నీవు ముమ్మాటికిని శేషశయనుని సందర్శింపఁగలుగు
దువు,’’ నని బాలునకుఁ దద్రహస్యములెల్ల నామూలాగ్రముగ
నుపదేశించె.

అట్లు ధ్రువుఁడు నారదోపదేశమున యమునాతటంబున
నున్న మధువనంబున కేఁగెను. ధ్రువుఁడు నగరము విడిచి
యరిగినసంగతి యుత్తానపాదుఁడు తెలిసికొని యతనికై పరిపరి
విధంబులఁ బరితపించుచుండెను. ఇట్లుండ నలినసంభవసంభూతుఁ
డుత్తానపాదనరేంద్రుని దర్శింపవచ్చి, యారాజుచే వివిధార్చన

ములం దిడి యుచితాసనోపవిష్టుండై "రాజేంద్రా! నీవదనము
కళావిహీనమై కన్పట్టుచున్న దేల? ఎల్లరకుఁ గుశలమే కదా?"
యని ప్రశ్నింప నుత్తానపాదుఁడు, దేవా! త్రిలోకసంచారులగు
దేవరకుఁ దెలియని యుదంత మీ ముజ్జగంబులందుఁ గలదా?
నా విచారహేతువు నానోటనే విన దలఁచి యిట్లడుగుచుంటిరి.
పంచాబ్దప్రాయుండగు మత్పుత్త్రుండు నాచే పరిభవింపఁబడి,
తల్లియనుజ్ఞ వడసి క్రోధమున గృహమువిడిచి వెడలె. మనఃక్లే
శకలితుఁడై, క్షుధాపిపాసలపీడితుఁడై, ఘోరాటవులఁ గ్రిమ్మరు
నా సద్గుణసాంద్రుఁడు, సుకుమారుఁడు, ధ్రువుఁడు భయంకర
వ్యాఘ్రభల్లూకాది వన్యమృగకోటికిఁ బాలఁబడక మరలివచ్చు
నా? నాకన్నుల కఱవుదీఱఁ జూతునా? నాకొమరుని జాడ దేవర
కెఱుకపడకపోదు. ఒక్కించుక తెలియఁబలికి నా ధైర్యమును
నిలువవేఁడుచున్నాన"ని వినయముగఁ బలుక, నారదుఁ డాతని
యెడ జాలివహించి "నరేంద్రా! నీభాగ్యము సామాన్యము
గాదు. నీపుత్త్రుఁడు నిరుపమానసౌజన్యమున గణ్యతనొందిన
మహానుభావుఁడుగాని కేవల డింభకుఁడుగాఁడు. అతఁడు సరో
రుహాక్షుని చరణసరోజయుగ్మము నాశ్రయింపఁబూని చనియె.
కతిపయవాసరంబులకా గుణరత్నాకరుం డిటకు క్షేమముగా
రాఁగలఁడు. ఇంచుకేని విషాదము నొందకుమ"ని పలికి నారద
మౌని వెడలెను.

నారదునివాక్యములవలన నుత్తానపాదుఁడు కొంత ధైర్య

ము వహించి వెలుఁగుచుండెను. మునివరేణ్యునాజ్ఞానుసారము ధ్రువుఁడు యమునానదీతీరమున మధువనంబున భగవంతుని ధ్యానింపఁదొడఁగెను. తన యంతరంగమున ననంతునినిల్పి, మూఁడేసిరాత్రులకొకసారి కపిత్థబదరీఫలపారణుండగుచు నొక్కమాసంబును, యాఱేసిదినముల కొక్కపరి జీర్ణతృణపర్ణాహారుండై రెండవమాసంబును, నవరాత్రింబులకొకమా ఱుదక భక్షణమాత్రుండై మూడవమాసమును, ద్వాదశదినంబుల కొకతోయము వాయుభక్షణముఁ జేసి జితశ్వాసుండై నాలవ మాసంబును, పిమ్మట నిరుచ్ఛ్వాసుండై చేతనారహితంబగు స్థాణువుక్రియ నేకపదంబున నిలిచి యైదవమాసంబును పరమాత్ముని సేవించె.

ధ్రువుఁడు తనహృదయమున విషవాంఛలఁ జొరనీయక శాశ్వతబ్రహ్మంబును నిలిపి హరిరూపమునకంటె నన్యమెఱుఁగక శ్రీహరిని ధ్యానించుచుండ, ముల్లోకములు మిగులఁ గంపమొంద సాగెను. అయ్యర్భకుఁడు ధరణి నొక్కపాదంబుఁ జేర్చినిల్చియున్న వేళ, సర్వాలు నంగుష్ఠపీడఁ జేసి పుడమి దిగఁబడఁజొచ్చెను. ప్రాణనిరోధమున దేవతానీకము తాళఁజాలక పరాత్పరునిఁ జేరి "దేవా! మున్నెన్నఁడు నెఱుఁగనియట్టి వాయునిరోధము సర్వలోక వేదనాకరంబయ్యె. శరణార్థులము మాయార్తి హరించి కావకున్న నింక గతిలేదు" ని వేఁడిరి.

అంత భగవంతుఁ డుత్తానపాదునికొమరుఁడు ధ్రువుఁడు

నిరుపమాన మనిశ్చలభక్తియుక్తుఁడై తన్నారాధించుచున్నాఁ
డనియు, నచిరకాలముననే తా నతనికడకరిగి వానియభీష్టము
నెఱవేర్తుననియు, వారిని భయమందవలదనియుఁ జెప్పి, వారిని
వారివారినివాసముల కంపి, తోడనే శంఖచక్రాది దివ్యాయుధోప
లక్షితుండై మధువనముఁ బ్రవేశించెను.

ఇట్లు సాక్షాత్కరించిన పురాణపురుషుని ధ్రువుఁడు
దండప్రణామము నొనరించి సంస్తుతింప నారంభించెను. కాని,
బాలుండగుటచే నమ్మహావిష్ణువు నెక్కరణి స్తుతింపవలయునో
తెలియక, నివ్వెఱఁబోయి నిలిచి చూచుచుండెను. శ్రీహరి యది
గ్రహించి విజ్ఞానమయమగు తన శంఖమున నబ్బాలుని కపోలతల
ముంటెను. తోడనే గ్రంగార్ఘుగీసంకాశంబగు స్తోత్రప్రవంతి
బయలువెడలి ధ్రువుఁడు, "దేవా! నీకంటెఁ బరాత్పరుఁ
డెవ్వఁడు? లోకజ్ఞానముచాలని నాయట్టియర్భకుఁడు లోక
నాథుఁడవగు నిన్నెట్లు వినుతింపనేర్చును? నీవు సర్వభూతాత్ముం
డవు. లోకవృత్తియెల్ల భగవదీయేచ్ఛానుగ్రహములచే నడచు
చున్నది.

మ. అరవిందోదర తావకీనచరణ ♦ ధ్యానానురాగోల్లస
చ్చరితాకర్ణనజాతభూరిసుఖముల్ ♦ స్వానందకబ్రహ్మమం
దరయన్ లేవఁట దండిభృద్భటవిమా♦నాగ్రస్థితి కూలు నా
సురలోకస్థులఁ జెప్పనేల సుజన♦స్తోమైక చింతామణీ.

చ. హరిభజనీయమార్గనియ•తాత్మకులై భవదీయరూపమై
వఱలిన భక్తియుక్తులగు•వారలసంగతిఁ గల్గఁజేయు స
త్పురుషనుసంగతిన్ వ్యసన•దుస్తరసాగరమప్రయత్నతన్
నరసభవత్కథామృతర•సంబున మత్తుఁడనై తరించెదన్.

చ. నిరతముఁ దావకీనభజ
నీయుపదాబ్జ సుగంధలుబ్ధులై
వ్వరిమదిఁ బొందఁగాఁగలుగు
వారలు తప్పియు మర్త్యదేహము
న్నరయఁ దదీయదారతన
యాది సుహృద్గృహబంధువర్గముల్
మఱతురు విశ్వతోముఖర
మాహృదయేశ ముకుందమాధవా.

సీ. సర్వలోకకల్పాంత • సమయంబునందు నీ
యఖిలప్రపంచంబు • నాహరించి
యనయంబు శేషసం•హాయుండవై శేష
పర్యంకతలమునఁ • బవ్వళించి
యోగనిద్రారతి•నుండి నాభిసింధు
జస్వర్ణలోక కం•జాతమున
నందుఁ జతుర్ముఖు • నమరఁ బుట్టించుచు
రుచిరాబ్జ [illegible]•హాపినైన

ధ్రువుఁడు నిశ్చేష్టుఁడై నిలచి, భగవంతుని దర్శించుభాగ్యం మఱి
వడియు మోక్ష మర్థింపనైతినిగదా యని పరితపించి, పరమేశ్వ
రుఁడు ప్రసాదించినఫల మతిస్వల్పమని తలఁచి నిజపురాభిముఖుఁ
డై బయలువెడలెను.

ధ్రువునిరాక కర్ణరసాయనంబుగ నుత్తానపాదునకుఁ దెలి
యరాఁగా, నాతఁడు కుమారుఁడు తిరిగివచ్చుట చచ్చినవారలు
లేచివచ్చుటవంటిదని తలంచెను. మరల దేవర్షిపుంగవుఁడగు
నారదమునివాక్యములు జ్ఞప్తికిరాఁగా నాశాంకూరములు తల
చూపసాగె. తన నిరుపమానతపోమహిమచే భగవంతుని మె
ప్పించి, మనోభీప్సితములు వడసినకారణమున ధ్రువుఁడు
తిరిగి రాఁగలుగుట నిశ్చయమని తలఁచి, యాశుభవుహూర్త
ము గొనివచ్చినచారునకు కతిఁ దమూలితదివ్యభూషణాంబరశ్రేణి
బహుమానముసఁగి, బంధుజనామాత్యపరివృతుఁడై కుమారున
కెదురు చనెను. అట్లతఁడు కొంతదూర మేగునరికి రమాకళత్ర
పాదారవిందయుగళార్చనాపరుండగు పుత్రుఁడు నయనోల్లాస
ముగ సాక్షాత్కరించె. అంత నుత్తానపాదుఁ డపరిమితానంద
ముచఁ గుమారునిఁ గౌఁగిలించుకొని, మోము నిమిరి శిరంబు
మూర్కొని, యవ్యయానందబాష్పధారల నతని నభిషిక్తుఁ జేసి
యాశీర్వదించెను.

అంతట ధ్రువుఁడు జనకుని పాదారవిందములకు సాష్టాం
గముగ నమ్రఁగి, సవమాతలను మోసి కని తన కట్టెదురు

గల్గకుండ వల్లారుముద్దుగఁ బెంచి, తనకై నిరీక్షించుచున్న కన్న
తల్లి సునీతికిని, దొలుతఁ దాను తండ్రియంకమునఁ గూర్చుండఁ
బోయిన యదనునఁ దన్ను నిరాకరించినను చివరఁ దనకు కారణ
గురువై జ్ఞానరహస్యోపదేశము నొసరించిన, పినతల్లి సురుచికినిఁ
గూడఁ బ్రణతులొనరించె. ధ్రువుఁడు తల్లులవలన నాశీర్వా
దములఁ బడసెను. పౌరజనాళియు నబ్జనాభునికృపచే వత్సల
భక్తుఁడగు ధ్రువునివలన, ధరామండలంబెల్లఁ జిరకాలము సుర
క్షితంబయ్యెడుఁగావుతమని దీవించిరి.

ధ్రువుఁడు సంతోషాంతరంగుఁడై, యుత్తమవమతంబుగ
గజారూఢుఁడై పరిజనపరివృతుఁడై, నగరాభిముఖుండయ్యె.
అట్లతఁడు వెడలుచు రాజమార్గము నిర్గమించుచుండఁ,

మ. హర్మ్యపఙ్క్తుల్ పురకామినీజనులు సౌ
ధాగ్రంబులందుండి శౌ
స్వైర సిద్ధార్థఫలాక్షతప్రసవదూ
ర్వాప్రీత దధ్యంబువుల్
గరవల్లీ మణిహేమకంకణఝుణ
త్కారంబు ఘోషిల్లఁ జ
ల్లిరి యాభాగవతోత్తమోత్తమునిపై
లీలాప్రేమయంబుగన్.

ఇట్లుత్థానపాదుఁడు మిగుల వైభవముతోఁ గుమారునిఁ
గూర్చి రాజసౌధం బలంకరించె. అంతటినుండియు నుత్తాన

పావఁడు రాజర్షిసత్తముఁడయ్యెను. నారదమునీంద్రునివలన ధ్రువునిప్రభావముఁ దెలిసినవాఁడగుటచే నుత్తానపాదుఁడు ధ్రువకుమారుఁ డనన్యసామాన్యములైన వరపరంపరల నొందె నని మిగుల సంతసించెను. ధ్రువునికార్యదీక్షకు భగవద్భక్తి మొలకువెట్టినతెంపుఁ గనుమునకు, నాతఁడు రాజకార్యములోన నివ దక్షుఁడని పౌరజానపదు లందఱు ననుకూలురగుటచే నొక్క కాను.

ధ్రువుని రాజ్యభారమున నియమించు టెంతయు నుత్తమమైనదని తలఁచి, యుత్తానపాదుఁ డొక శుభముహూర్తమున నిజపురోహిత సామంత మంత్రివర్గ పౌరజన మిత్రబృందము ను రావించి ధ్రువుని నభిషిక్తుఁ గావించెను. మఱియు నుత్తానపాదుఁడు వృద్ధవయస్కుండై, విరక్తుఁడై వనంబునకుఁ జనియె.

రాజ్యభారము నవలంబించిన నాఁటినుండియు ధ్రువుఁడు ప్రజలనెల్లఁ గన్నబిడ్డలకరణిఁ బాలించుచు పౌరులమన్ననలకుఁ బాత్రుఁడయ్యె. ఆధరాతలేంద్రుఁడు శింశుమారప్రజాపతి కూఁతురైన భ్రమియను పడఁతినిఁ బరిణయమాడి, యామెవలనఁ గల్పవత్సరులను నిద్దరు కొమరులం బడసి, మరల వాయుపుత్రి యైన యిలయను భార్యయం దుత్కలనామకుండైన కొడుకును నతిమనోహరమైన కన్యారత్నంబుఁ గనియె.

ధ్రువునిభ్రాతయగు నుత్తముఁడు వివాహముకాకయె మృగయావినోదార్థము వనంబునకరిగి, హిమవన్నగప్రాంతమున

యక్షునిచే మృతుండయ్యె. వాని మాతయును సురుచి యీ
వార్త విని, దుఃఖసాగరమున మునింగి యరణ్యవీథులం బడి
సంచరించుచుండి, గహనదహనుని కాహుతియయ్యె. ఆహా! దైవ
మాయ! కుమారుండును తల్లియుం గూడ దివికేగిరి!

ధ్రువుండు భ్రాతృమరణ సంజనిత శోకవ్యాకులమాన
సుండై, యుత్తముని జంపిన శత్రువును కాలుని పోలికం
జైత్రంబను రథంబెక్కి యుత్తరాభిముఖుండై చని, హిమవద్ద్రో
ణియందు ఘోరంగా సేవితంబును గుహ్యకావాసంబునైన యలకా
పురంబు వొడగని, మహోద్రేకంబున శంఖము బూరించె.
ఆశంఖనినదము యక్షకాంతల గుండియలు ఝల్లు జేసె. పరిపంథు
లెవ్వరో వచ్చిరని సమరోత్సాహంబున యక్షులు వివిధాయుధ
యుతులై ధ్రువుని ముట్టడించిరి. దుర్నిరీక్ష్యపరాక్రముండగు ధ్రువుం
డు వారలను నిశితశరపరంపరలచే బాధింపఁజొచ్చెను. యక్షు
లును శరవర్షంబును గురియించిరి. ధ్రువసమ్రాట్ మునిఁగెనేమో
యని మింట సిద్ధగణంబులు చింతించుచుండ, ధ్రువుండు హత
మయ్యెనని యక్షులు సంతసింప మొదలిడిరి. అంత సర్వాల
భక్తుండగు ధ్రువుండు, యక్షసైన్యముల వివిధములైన నారాచ
పరంపరలచేఁ జాలవరకు వికలాంగులఁ జేసె. సమరరంగము
వీరమనోహరాకృతిం బూని భయంబుఁ గొల్పుచుండె. యక్ష
నికాయమున హతశేషులు సమరవిముఖులై పలాయితులైరి.
మనుజాశన మాయలను గప్పికొన్న ధ్రువుండు, సాంధ్యో

గూడి నత్పురప్రవేశంబుఁ జేయఁబోవునంత, నప్పురముఁ గన్పడ కుండుటచే నాప్రయత్నము మాని, కర్తవ్య మాలోచించుచుం డెను. అంత మహాభయంకరంబగు శబ్దంబొక్కటి ధ్రువునికి శ్రవణగోచరంబయ్యె. రక్కసిమూఁకలు గగనమునుండి మస్తి ష్కపురీషమూత్రజలంబుల నెత్తురులఁ గురియింపఁదొడం గిరి. మఱియు మత్తేభసింహవ్యాఘ్రసమూహంబులు కట్టెదుట నుగ్రమూర్తులఁ దాల్చియుండెను. ముందు మహాతరంగానీక మున సముద్రంబును, వెనుక భీమమహాహ్రదంబును నాట లాడుచున్నట్లు ధ్రువునకుఁ బ్రదర్శితములయ్యె.

ఇట్టి భయంకరవైచిత్ర్యములఁ దిలకించుచు, నందులకు సాధన సిద్ధియని తత్తఱపడుచుండిన ధ్రువునికడకుఁ గొందఱు మునులు వచ్చి, “భక్తజనార్తిహరుండగు భగవంతుఁ డొక్కఁ డే నీయార్తిఁ బరిమార్పఁగలఁడ”ని యుగ్గడించి నిజేచ్ఛం జనిరి. అంత ధ్రువుఁడు మునివరులహితంబును శిరమునఁ దాల్చి, కృ తాచమనుండై లక్ష్మీవల్లభుని పాదకమలముల స్మరించి, రిపుభ యంకర మహోగ్రశక్తినారాయణాస్త్రంబును కార్ముకమున సంధించునంత, నసురమాయాంధకారము దవ్వుదవ్వులకు విరిసి చనెను.

ఇవ్విధంబున వారు బాణపరంపరలచే వికలాంగులై చిత్రరథుని చుట్టుకొనిరి. యక్షపరివృతుండగు ధ్రువుండును తీవ్రబాణతతిచే శత్రుసమూహమును హతమొనర్చుచుండె.

అంత నాతని పితామహుఁడగు స్వాయంభువమనువు ఋషిగణ
పరివృతుఁడై చనుదెంచి, ‘‘వత్సా! ఇదేటికార్యము! భ్రాతృ
మరణక్లేశ సంజనితరోషంబున నిరపరాధులగు వీరల వధించుట
ధర్మమే! శిశుప్రాయముననే లోకారాధ్యుండగు నారాయణుని
సేవించి సత్కీర్తి నందిన బాలభక్తాగ్రేసరుఁడ వీవు చెల్లునే! ఒక
యక్షుఁడు నీతమ్మునిఁ బరిమార్చెనని పెక్కండ్రి నిత్తెఱంగున
మడియించుట భావ్యమే? నీక్రోధానలంబు విడిచి యవ్యయుం
డగు శ్రీహరిని భజించి స్థిరకీర్తి నార్జింపుము. భ్రాతృహంతలని
తలఁచి యక్షుల నిట్లు వధించి కుబేరున కపకృతి నాచరించితివి.
కావున నీవాయర్ధవిభునిఁ బ్రసన్నునిగఁ జేసికొనుము. విద్యా
మదములచే ఘనరోగములెల్ల నశించుకరణి రోషవ్యాపకయమున
లోకములెల్ల నశించును. కావున నీవిఁక నేను చెప్పిన చొప్పున
శాంతమున వర్తింపుము’’ని చెప్పి, ధ్రువునిచే సత్కృతుఁడై
స్వాయంభువు వెడలెను.

అంత ధనదుఁడు యక్షచారణ సిద్ధవిద్యాధరాదిజనగణ
స్తూయమానుఁడై, క్రోధరహితుండైన ధ్రువునికడకుఁ జను
దెంచి, కృతాంజలియైన ధ్రువునిఁ జూచి ‘‘క్షత్రియకుమారా!
నీపితామహు నాజ్ఞానుసారమున విరోధముడిగినందుల కెంతయు
ముదమయ్యె. నీతమ్మునిఁ దునుమట్టించినవార లీయక్షులుంగారు.
ఈయక్షగణము నిట్లు వధించినవాఁడవు నీవునుగావు. ఇదంతయు
భగవద్విలాసము. భూతజననలయంబులకెల్ల నిరంతరముఁ గా

బంబేకర్త. అందుచే నీవు సర్వభూతాత్మవిగ్రహుండైన సర్వే
శ్వరుని సేవింపుము. నీకు శుభంబగు. నీకిష్టంబగు మనోభీష్టము
నొసంగింపు మవశ్యమనుగ్రహించెద"నన, భాగవతాగ్రేసరుం
డగు ధ్రువుండు, "ఏమహామహునిస్మరణకతంబున నజ్ఞానాంధ
కార మడుగంటునో, యట్టి శ్రీవల్లభుని స్మరణంబ చలితంబుగ
నాహృదయమున నిలుచునట్లనుగ్రహింపుమ"న వార్యక్షుఁడు
వల్లెయని యంతర్ధానము నొందె.

అనంతరము ధ్రువుఁడు నిజనివాసమునకుఁజని, నారాయ
ణునియందు బుద్ధినిలిపి, పౌరజనావళిఁ గన్నబిడ్డలభంగి నాద
రించుచుఁ గీర్తివల్లికలెల్ల దిక్కులనల్లుకొన నిఱువదియాఱువే
లేండ్లుఁ ద్రివర్గసాధనంబుగ రాజ్యంబుఁ జేసి, కుమారునకుఁ బట్ట
ముఁగట్టి విశ్వంబెల్ల భగవన్మయాకారచితంబని తలఁచుచు విరా
గియై,

చ. మనువిభుఁడంత భృత్యజనమంత్రిపురోహితబంధుమిత్రసం
తనపశువిత్తరత్నవనితాగృహరమ్యవిహారశైలవా
రినిధిధరిత్రి భూతలవాటిద్వీపముఖ్య పదార్థజాలముల్
ఘనమతిచే ననిత్యములుగాఁ దలపోసి విరక్తచిత్తుఁడై.

బదరికాశ్రమముం బ్రవేశించి నిశ్చలచిత్తుఁడై, భగవం
తునిఁ దనహృదయారవిందమున నిల్పి భజియించుచుండె.

అట్లు తపంబొనరించు రాజేంద్రునిసన్నిధికి, దనతేజో
విశేషము నల్లదిక్కులు గ్రమ్ముకొనియుండు నొక దివ్య

విమానము గంభీరరవంబున వచ్చి నిలచె. అందు సకలలక్షణ
లక్షితులును కిరీటాంగదధారులును తులసీదామములతో విల
సిల్లువారును కౌమారవయస్కు లిరువురుండిరి. ధ్రువుఁడు
వారలఁ గాంచి విష్ణుదూతల నిగ్రహించి బద్ధాంజలియై వారిని
సేవించె. భక్తాగ్రేసరులగు యామునందనందులు మందస్మిత
సుందరవదనారవిందులగుచు, "నీకు శుభంబయ్యెడుఁ గావుత.
పంచాబ్దంబులనాఁడు మహాతపోవ్రతనిష్ఠుండవై మధుసూదనునిఁ
దృష్టి పఱచిన బాలభక్తావతంసుఁడవు. ఆశ్రీవారి నిన్నుఁ గొని
తేరఁ బనుప నిచ్చటికేతెంచితిమి. నైశంబవిమానా రూఢుండవుగ
మ్మిదిగో విమానము గమ్మని పల్కిరి.

అనంతరము ధ్రువుఁడు సంతసమొంది, వారలకు నమ
స్కరించి వారియాశీర్వచనములఁ గైకొని, కాంచనమయరూపి
యయ్యెను. అంత సురదుందుభులు మ్రోఁగెను. కుసుమవృష్టి
గురిసెను. అపుడు ధ్రువుఁడు త్రివిష్టపమునకు నేగువాఁడగుచు
మాతృదేవతను దలఁచుకొని యామెనువిడిచి పోవొల్లకఁ గరం
బు చింతిల్లుచుండగా. విష్ణుదూత లది గ్రహించి, తుఱటియొక విమా
నమున ముందరుగుచున్న తల్లిని ధ్రువునకుఁ జూపిరి. ధ్రువుఁ
డవారామోదయుత హృదయారవిందుఁడై, విమానారూఢుఁ
డై వెడలి హరిపదముఁ జెందెను.

పదేండ్ల ప్రాయమున నాత్మగౌరవమునకై, పినతల్లియా
డిన దుర్భాషల నించుకయు సహింపఁజాలక పరిత్యాగమునకేగిన

లంబెఱర్తు. అందుచే నీవు సర్వభూతాత్మవిగ్రహుండైన సర్వే
శ్వరుని సేవింపుము. నీకు శుభంబగు. నీకిష్టంబగు మనోభీష్టము
నెఱింగింపు మవశ్యమనుగ్రహించెద"నన, భాగవతాగ్రేసరుం
డగు ధ్రువుండు, „ఏమహామహునిస్మరణాకలంబున నజ్ఞానాంధ
కార మడుగంటునో, యట్టి శ్రీవల్లభుని స్మరణంబ చలితంబుగ
నాహృదయమున నిలుచునట్లనుగ్రహింపుము"న హర్యక్షుండు
నట్లైయని యంతర్ధానము నొందె.

అనంతరము ధ్రువుండు నిజనివాసమునకుఁజని, నారాయ
ణునియంద బుద్ధినిలిపి, పౌరజనావళిఁ గన్నబిడ్డలభంగి నాద
రించుచుఁ గీర్తివల్లికలెల్ల దిక్కులనల్లుకొన నిఱువదియాఱువే
లేండ్లుఁ ద్రివర్గసాధనంబుగ రాజ్యంబుఁ జేసి, కుమారునకుఁ బట్ట
ముఁగట్టి విశ్వంబెల్ల భగవన్మాయారచితంబని తలఁచుచు విరా
గియై,

చ. మనువిభుఁడంత భృత్యజన•మంత్రిపురోహితబంధుమిత్రసం
దనపశువిత్తరత్నవని•తాగృహరమ్యవిహారశైలవా
రినిధివరీత భూతలవా•రిద్విపముఖ్య పదార్థజాలముల్
ఘనమతిచే ననిత్యములు•గాఁ దలపోసి విరక్తచిత్తుఁడై.

బదరికాశ్రమముం బ్రవేశించి నిశ్చలచిత్తుఁడై, భగవం
తునిఁ దనహృదయారవిందమున నిల్పి భజియించుచుండె.

అట్లు తపంబాచరించు రాజేంద్రునిసన్నిధిక్, దనతేజో
విశేషము నెల్లదిక్కులు గ్రమ్ముకొనియుండు నొక దివ్య

విమానము నగరవనంబున వచ్చి నిలచె. అందు నీలలతాంగ లక్షితులును, కిరీటాంగదధారులును తులసీదామములతో నిల సిల్లువారును కౌమారవయస్కు లిరువురుండిరి. ధ్రువుఁడు వారలఁ గాంచి విష్ణుదూతల నిగ్రహించి బద్ధాంజలియై వారిని సేవించె. భక్తాగ్రేసరులగు యాసునందనందులు మందస్మిత సుందరవదనారవిందులగుచు, "నీకు శుభంబయ్యెడుఁ గావుత. పంచాబ్దంబులనాఁడు మహాతపోవ్రతనిష్ఠంబూని మధుసూదనునిఁ దృప్తిపఱిచిన బాలభక్తావతంసుఁడవు. ఆశ్రీహరి నిన్నుఁ గొని తేరఁ బనుప నిక్కడికేతెంచితిమి. వైకుంఠవిమానారూఢుండవు గమ్మిదిగో విమానమునిమ్మని పలికిరి.

అనంతరము ధ్రువుఁడు సంతసమొంది, వారలకు నమస్కరించి వారియాశీర్వచనములఁ గైకొని, కాంచనమయరూపి యయ్యెను. అంత సురదుందుభులు మ్రోఁగెను. కుసుమవృష్టి గురిసెను. అపుడు ధ్రువుఁడు త్రివిష్టపమునకు నేగువాఁడగుచు మాతృదేవతను దలఁచుకొని యామెనువిడిచి పోవల్లకఁ గరంబు చింతిల్లనాగ. విష్ణుదూత లది గ్రహించి, మఱియొక విమానమున ముందరుగుచున్న తల్లిని ధ్రువునకుఁ జూపిరి. ధ్రువుఁ డపారామోదయుక్త హృదయారవిందుఁడై, విమానారూఢుఁడై వెడలి హరిపదమందెను.

పదేండ్లప్రాయమున నాత్మగౌరవమునకై, పినతల్లియాడిన దుర్భాషల నించుకయు సహింపఁజాలక పరిత్యాగమునకేగిన

ధైర్యశాలిని, యుగ్రతపంబునఁ బరమేశ్వరానుగ్రహంబుఁ బడసిన బాలభక్తుఁడగుధ్రువుని, ధరామండలంబెల్లఁ దనయశశ్చంద్రికా పల్లవము లల్లుకొనున ట్లిరువదియాఱువేలేండ్లు, త్రివర్గసాధనంబుగ రాజ్యరమనేలిన ధ్రువక్షితీంద్రుని, దేవవిమానారూఢుండగు సమయమున, జనని చరణకంజములఁ జిత్తమునఁ దలపోసి భజించిన మాతృభక్తిపరాయణుని, పవిత్రచారిత్రము నాదర్శముగా నిడికొని ప్రవర్తిల్లు విద్యార్థిబృందము కడుంగడు పావనమైనది.

యశస్కరంబును పుణ్యప్రదాయకంబును మంగళకరంబునైన ధ్రువునిచారిత్రము నెవ్వఁడేని దినాంతప్రభాతవేళలఁ బూర్ణిమామావాస్యలందు ద్వాదశిని పద్మబాంధవవాసరమున శ్రవణానక్షత్రమున దినక్షయమున సంక్రమణ వ్యతీపాతములందున, భక్తిశ్రద్ధలతోఁ బఠించిన, నజ్ఞానాంధకారము నుత్తునియలై శుభం బొసఁగూడుఁగావుత !

ధ్రువచరిత్ర సంపూర్ణము.





శ్రీరామ.

# బాలభక్తులు.



## 8. మార్కండేయుఁడు.



శ్రీమదుమామహేశ్వర పాదారవింద ధ్యానానంద పరిపూర్ణహృదయుండును, నిజతపోయశఃకీర్తనీయుండును విభాండకమునీంద్రుని తనయుండునైన మృకండుఁడను ఋషీశ్వరుఁడు మరుద్వతియను సతీతిలకమును విధ్యుక్తముగ నుద్వాహమాడెను. వారెంత సుఖముగఁ గాలముఁ గడపుచున్నను వారలనపత్యులగుటచే సతీపతులస్వాంతములు దుర్భరచింతాక్రాంతములయ్యెను.

మహర్షులు కొందఱొకనాఁడు పితామహదర్శనోత్సాహులై గగనమార్గమునఁ జనుచుండ, మృకండుఁడు వారల నిచ్చటికిఁ బోవుచుంటిరని యడుగ, వాణీధవుఁగాంచ సత్యలోకమునకని ప్రత్యుత్తరమొసంగిరి. అంత మృకండుఁడు తాను

వారలతో నరిగి కమలసంభవునిఁ జూడఁ గాంక్షించి మరుద్వతి
తో ,, నేనీఋషిసత్తములతోఁ గలసి యజ్ఞం దర్శించి వచ్చెద.
ఇచ్చటకు క్షుత్పిపాసార్తులై యరుదెంచు నతిథిబృందమునకుఁ
గొఱఁత లేకుండునటుల సత్కరించుచు ధర్మమార్గమునఁ జరింపు
ము. ఎల్లరకును ధర్మమే శరణ్యమని యెఱుంగుము. స్వచ్ఛమైన
ధర్మము ప్రాణికోటికి విడువరానిది. ధార్మికునికంటె సుఖవం
తుఁడును విద్వాంసుఁడును మఱియొకఁడు లేఁడు. ధర్మమేనుపా
ద్యుఁడు. వంచన మించుకయులేక సదా ,, పరోపకారార్థ
మిదం శరీరము ’’ను వార్యోక్తి ననుసరించి వర్తింపవలయును.
అకాలమృత్యువువాత బడకున్నను ,, జాతస్యమరణం ధ్రువమ్ ”
ను నటుల నూతేండ్లు బ్రతికినను మరణము నిశ్చయము. కాయ
మెన్నటికైన నశించునదియే. కావుననే మోక్షమర్థించు పు
ణ్యాత్ము లెన్నటికైన దహింపఁదగినదగు వంజరతుల్యమైన నీ
తుచ్ఛశరీరము నణుమాత్రమైన నాశయుంచరు. త్యాగ భోగ
సాధనమగు ధనమే ధనమనఁబడును. ఎంతటిధనవంతునైనను
త్యాగశూన్యు నెవ్వరుఁ బాటింపక, ధనహీనుఁడైనను త్యాగి
యైనవాని నెల్లరును కొనియాడుదురు. భూతదయకలవాఁడే
లోకమున నుత్తమపురుషుఁ డనఁబరగును. అభయదానము
కంటె మఱియొండు దానములేదు. అన్నదాన గోదాన భూదాన
మాదిగాఁగలదానము లెన్నియైనఁ జేయువార లెందఱో గలరు.
కాని యభయదానమునకు దిగశక్తియుతులు పుణ్యాత్మ

లరుదుగదా! కావున కాయము బుద్బుదప్రాయమనియు, నీటఁ
బోలి మృత్యువుకూడ నందునదియనియు వైభవ మనిత్యమని
యు, కీర్తియే యాచంద్రార్కస్థాయియనియుఁ దలఁచి, పరోప
కారము నేమఱక, ధర్మమార్జింపవలయునని నీతు లనేకము
లుపదేశించి వాగీశుని దర్శింపఁబోయెను.

అట్లామహర్షి వెడలి యంభోజసంభవసభం బ్రవేశింపఁ
బోవ నందలి దౌవారికులు, "దేవా! మీరెవ్వరు? మీవాస
స్థలం బెయ్యది? ఇచ్చటికి రాఁగతంబేమి? మీరలు సంతాన
వంతులరేనా?" యని ప్రశ్నించ నంత నాతాపసి, "నేను
విభాండకసూనుఁడను. నన్ను మృకండుఁడందురు. కమలాసన
దర్శనోత్సాహినై భూలోకమునుండి వచ్చియుంటిని. నాకురా
కృతజన్మదుష్కృతమునకో, మఱి యేయితర హేతువునకోగాని,
యీశ్వరుఁ డింతవఱకును నాకు సంతానప్రాప్తి నమకూర్పఁ
డయ్యె"నని బదులువలికెను. అంతట నాప్రతీహారులలో నొకఁ
డు "స్వామీ! మీరు సన్మునిపుత్రులైనను తపస్స్వాధ్యాయ
నిరతులైనను, సంతానవంతులు గాకపోవుటచే బ్రహ్మసభఁ
జొచ్చుట కనర్హులుగదా! అనపత్యులును నపత్యవంతులును,
పరమేష్ఠి సభ నలంకరింప నర్హులుగార"న నమ్మౌని, "ఆహా!
అపుత్రస్యగతిర్నాస్తి యనునది నాయందిప్పుడు సార్థకమైనది.
ఎన్ని యోగ్యతలు గలిగియున్నను నపుత్రకుఁడనగుటచేఁగదా,
వచ్చినపనిని వెనుకకు మరలవలసివచ్చెను! ఎంతటిపాతకి

నైతివ"ని పరిపరివిధంబులఁ బొక్కుచుఁ దిరిగి పోవుచుండెను.

ఇది యిట్లుండ వసుంధరత్యనసూయాది మునిసతులు మరుద్వతిఁ జూడరా నావె వారలఁ దోడ్కొని చని, సముచితాసనముల గూర్చుండనియమించి, «పతివ్రతారత్నంబులగు మీరలిచ్చట కేతెంచుటంజేసి సఫలీకృతమనోరథనైతిని. మిమ్ముల నుతింప నెంతటిదానను. పతివ్రతలకు త్రిమూర్తులును వశ్యులే గదా! ఇప్పుడు మీకు వలయునదేది" యన, వారలు «మార్గాయాసమునఁ బడలియున్న మేము పిపాసానివృత్తికై సుస్వాదు శీతలజలంబులఁ గాక నన్యమేమి వాంఛింతుము? కాఁబట్టి యిప్పుడయ్యవి గొని తెమ్మ"న, మరుద్వతి వారలకు వలయు మధురజలంబుం గొనిరా నమ్మునిసతులు, మీకు నందను లెందఱని ప్రశ్నించిరి. అంత నమ్మునిపత్ని చింతాక్రాంతస్వాంతయై, «మీయాశీఃప్రభావమున నింకముందుఁ గలుగవలయునుగాని, నేటివఱ కంతటి భాగ్యమునకు నోచనైతి" నని పలుకఁ, «పుత్రులులేనివారి గృహమున మేము జలంబులనైనఁ గ్రోలము. ఫాలాక్షునికటాక్షమున నీకు సంతానము కలుగును. మేమిఁకఁ బోయివత్తుము. ఇందులకై విచారింపకుమ"ని చెప్పి యామునిసతులు నిజేచ్ఛం జనిరి.

పిమ్మట మరుద్వతి మిగుల వగచుచు నాథునిరాకకై నిరీక్షించుచుండెను. దుర్భరచింతాభరంబునకుఁ బతివ్రతయు నెంతయుఁ దోఁటుపడ, విచారాక్రాంతవదనుఁడై మృకండుఁడు వచ్చి,

ఘోరదుఃఖసాగరనిమగ్నయైన తనసతిఁజూచి విచారకారణ మే
మని ప్రశ్నించి, యయ్యింతివలన యావద్వృత్తాంతముఁ దెలిసి
కొని మరుద్వతికి స్వసమాచారమునుగూడ నెఱింగించెను.

మఱియు నాతఁడు, "దేవీ! దైవలిఖితమును దప్పింప
నెవరితరమగును? జగన్నాథుఁడగు లక్ష్మీపతి యెఱుకువానికర
మునకు గుఱియయ్యెఁగదా! దివాకర నిశాకరులు రాహుగ్రహ
వేదన నొందుచుండుటఁ గాంచుచుండుటలేదా? దైవమును
నమ్మి యొనర్చినపనులెల్లఁ గొనసాగును. అయినను పురుషకార
ము లేక నట్టికర్జములైన నెఱవేఱుటసాధ్యము. అనపత్యుల
మని యనవరత మిట్లనివార్యచింతాసాగరమున మునుఁగుచుండిన
నేమిప్రయోజనము? కర్తవ్య మాలోచింపవలయును. సంతాన
విహీనమైన సంసారము నిష్ఫలకుజంబుమాడ్కి నిరర్థకముగదా!
కావున సంతానప్రయత్న మవశ్యకర్తవ్యము. అదియును శివా
రాధనములేక లభింపదుగదా! అల్పులమగు మన యారాధనం
బునకు మారుద్రుండు మెచ్చి మేలొనరించునా యని శంకింప
నవసరములేదు. అతఁ డాశ్రితవత్సలుఁడు. కాఁబట్టి నేను తపో
బలంబుచే నాశంకరుని వశంబుఁ గావించుకొనియెదఁ, జింతయు
డుగుము"ని బలికెను.

అనంతరము వారలిద్దఱు కతిపయదినమ్ములకుఁ గాశీ
నగరంబుఁ బ్రవేశించిరి. అచట వారు గంగానదీజలంబుల స్నాన
మాచరించి, వల్కలధారులై భక్తసులభుండగు భవానీప్రియుని

ప్రార్థింపఁదొడఁగిరి. వారల సునిశ్చలభక్తికి పార్వతీనాథుఁ
డెంతయు మెచ్చి ప్రత్యక్షమయ్యె. అంతవార లాసర్వమంగళ
ప్రియుని దివ్యసుందరవిగ్రహమును నేత్రోత్సవముగ దర్శించి
దండప్రణామంబు లాచరించి ,, దేవా! నిస్సారమగు సంసార
మహాంబుధిని దరిఁ గానక కొట్టుకొనుచున్న మాకు, భవద్దర్శనం
బొసంగుట మాయందలి దయావిశేషంబునఁగదా! దేవరగుణాతి
శయంబు వర్ణింప మే మెంతటివారము? అర్థహీనమైనను కోమ
రులపలుకుల తల్లిదండ్రు లాదరించునటుల, మీచరణారవింద
సేవకులమగు మమ్ము రక్షింపుము"ని ప్రార్థించిరి.

అపుడు శ్రీకంఠుఁడు సంతోషాంతరంగుఁడై ,, మీ
తపంబునకు నాకు కరంబు మోదంబయ్యె. మీయిచ్చవచ్చిన
వరం బిచ్చెద వేఁడుఁడ"న, వారలు ,, దేవా! అనేకపుణ్యవ్రత
ము లాచరించియుంటిమి. ఎన్నియో పావనక్షేత్రముల కేగి
యుంటిమి. కాని పుత్రవిహీనులమై మిగులఁ జింతించుచుంటిమి.
మాదురదృష్ట మేమోకాని, మాయొనర్చిన పుణ్యంబు లొక్క
టియును మాకు సంతానమొసఁగి, మమ్ముల నానందసాగరంబున
నాడింపఁజాలవయ్యెను. భక్తజనమందారమవగు నిన్నర్థించినఁ
గాని, సఫలీకృతమనోభీష్టులము కామని మదినెంచి, తపంబును
జేయుచుంటిమి. నేఁటికి నిన్నుఁగని ధన్యులమైతిమి. దయార్ద్ర
హృదయుండవై మాకొక్కతనయు నొసంగుము"ని వేఁడిరి.
అంతట నయ్యుమాపతి, ,,క్రిందటిజన్మమున మీరలు శివప్ర[illegible]

వరులు గాకుంటనే, నీజన్మంబున సంతానవిహీనులరైతిరి. ఇప్పుడు నన్నారాధించుచున్నకతంబున నాదయకుఁ బాత్రులైరి. కురూపియు, మూఁగయునై, కుజనుఁడగు దీర్ఘాయుష్మంతుఁ డగుపుత్రుఁడు గావలయునా! లోకమెల్లరచేఁ బొగడఁబడు బుద్ధిధీమంతుఁడును, నాయందు భక్తుఁడును, షోడశవత్సరమాత్రాయుష్కుఁడగు కుమారుఁడు వలయునా? కోరుఁడు" న నా తాపసోత్తముఁడు, పదునారువత్సరములు బ్రతుకువాఁడైనను సుపుత్రునే యనుగ్రహింపుమనియె. అంత శంకరుఁడు వల్లె యని యంతర్హితుండయ్యె.

అంతట వారలిరువురు, "గాజుతాలు గంపెడున్నను నొక్కరత్నముతో సరిగావుగదా! కర్ణకఠోరమగున ట్లఱచుచుఁ బెద్దకాలంబు జీవించి పొట్టఁబోషించుకొను కరటంబుకంటె, స్వల్పకాలంబు బ్రదికి యెల్లరచేఁ గొనియాడఁబడు మరాళము శ్రేష్ఠముగదా! అట్లే జననుతులుగాని సుతశతంబున్నను నిష్ఫలము. పౌరుషజ్ఞానకీర్తులఁ బరఁగి, వంశవృక్షమునకు యశోవల్లికల నల్లిబిల్లిగ నల్లఁజాలు, నొక్కకుమారుని యాయువెంత తక్కువయైనను, శ్లాఘ్యమైనదియే" యని సంభాషించుచు నిజావాసముఁ బ్రవేశించిరి.

కొంతకాలమునకు మరుద్వతి శివభక్తియుక్తుఁ డగుపుత్రుం గనియెను. మృకండుఁ డొకశుభదినంబునఁ దనూజాతునకు మార్కండేయుఁడని నామకరణమొనరించె. ఆబాలుఁడును దినదినప్రవర్ధమానుఁడగుచు, నుమామహేశ్వర చరణారవింద

ధ్యానమున వన్నెకెక్కుచు, నెల్లరమన్ననలకుఁ బాత్రుఁడగు
చుండెను. బాల్యప్రాయముననే భగవద్భక్తి యలవడు టెంతయు
దృష్టము! మృకండుఁ డొక శుభముహూర్తమునఁ దనయున
కుపనయనముఁ గావించి వేదశాస్త్రములెల్ల నుపదేశించె.

నిరంతరహరిభక్తియుక్తుండును బ్రహ్మజ్ఞానవిశారదుండు
నగు నారదమహాముని, యొకనాఁడు మృకండునిగృహంబున కతిథి
యై వచ్చెను. అంత నత్తపోనిధి యామహాపురుషునిఁ బ్రత్యు
త్థానాభివందనార్ఘ్యపాద్యాదుల యథావిధిఁ బూజించి, "మహా
త్మా! మీపదరజంబు సోఁకుటవలన మాయీనెలవు పావనం
బయ్యె. మే మెంతయు సదృష్టవంతులము" అని విన్నవించి, తన
సంతానవృత్తాంతము సాంతముగ, దెలియఁబలికెను. అంత నా
దేవర్షి త్రికాలవేదియగుటచే భావికాలవృత్తాంతమెల్ల దివ్యదృ
ష్టి నరసి మార్కండేయుఁడు దీర్ఘాయుష్మంతుఁడగునని పలికి
నిశ్చింతఁజనియె. సర్వదా సర్వేశ్వరచరణసరోజధ్యానమున భా
సిల్లుచు, సర్వదా నెల్లరచే నుతిపాత్రులగు భక్తులకేకొఱంతయు
లేదుకదా!

పిమ్మట మృకండుఁడు మార్కండేయుని వెంటఁగొని,
మున్యాశ్రమంబులకుఁ బోయి, యచ్చటి తపోధురంధరుల పా
దారవిందములకు నందనునిచే నమస్కారములు చేయించి, వా
రల యమోఘాశీర్వచనముల కపరిమితానందము నందుచు,
సత్యలోకమునఁ గమలాసనుఁ గనఁ బుత్రునిఁగూడఁ దీసుకొని

యడిగెను. కాకతాళీయంబుగ నచ్చటఁ ద్రిమూర్తులు నొక్కచోఁ గూడియుండిరి. అంత మార్కండేయుఁడు తొలుతఁ గమలభవు నకు నమస్కరింప, నాపెద్ద చిరంజీవివగుమని దీవించెను. అంత శివుఁడు రోషమునఁ, "బ్రహ్మా! ఎంతపనిఁ జేసితివి! వీఁడు షోడశాబ్దపరిమితవయస్కుం డగునని నేను వరంబొసంగి తిని. ఇట్లు దీవింపఁదగునా" యన, "నేనొనరించిన యపరాధ మెద్దియునులేదే! మీరు పదునాఱేండ్లవయస్సు ప్రసాదింప, నేను జిరంజీవివగుమని యాశీర్వదించితిని. ఉభయవరంబులకును భంగము వాటిల్లకుండ నొకటిచెప్పెద వినుఁడు. నాదీవనచే జిరంజీవిత్వమును, భవద్వరప్రకారంబుగ షోడశాబ్దవయస్కుం డునునై, నీయుగ్రుఁడు జరామరణశూన్యుఁడై సర్వదా పదు నాఱువత్సరముల ప్రాయముగలవాఁడై యుండును" అని సర్వతో ముఖుఁడు ప్రత్యుత్తరమొసంగెను. అంత నప్పంచముఖులకు హృషీ కేశుం డలరి "నాళీకభవా! నీవాక్చాతురికి నెంతయు మెచ్చి తిని. నాకు నదియే సమ్మతమని తోఁచినద"నెను.

మృకండుఁ డవ్వేల్పుల యనుజ్ఞఁ బడసి, తనూజునితోఁ గూడ మరలి మార్గమధ్యమున ధ్యానంబున నీరీతి వితర్కింపఁ జొచ్చెను. భూతాత్ముఁడు చిరంజీవ యని దీవించుటయు, భూ తపతి యాతనికిఁ గోపించుటయుఁ బ్రహ్మదేవుఁడు శంకరుని వాక్యంబును దనదీవనయుఁ గూడ వమ్ముగాకుండ, మరల సమర్థిం చుటయు నది చక్కఁగనున్నదని విష్ణు వలరుటయుఁ జూడ నా

కతిచిత్రముగఁ గన్పట్టుచున్నది. విరించి దీవనకు భృంగువు కోపించనేకాని మరల సరస్వతీనాథుఁడు సమర్థించుటకును లక్ష్మీపతి సమ్మతికినిఁగూడ నంగీకరించినట్లు లేదే! నిరుత్తరుండయ్యెనే! అయిననేమి! నిరుత్తరం బంగీకారసూచకమనిగదా బుధుల పలుకులు! అట్లయిన, సుతుని యాయువుఁగూర్చి విచారింప నగత్యములేదు. ఏమో! వారిపలుకులు తనకిష్టములేకయే నిరుత్తరుండయ్యెనో మెట్టకేలకు సమ్మతించియే నిరుత్తరుండయ్యెనో యెట్లు నిర్ణయింపనగును? మాయదృష్ట మెట్లున్నదో!" యని యనుకొనుచు నిజనివాసముఁజేరి జరిగిన యావద్వృత్తాంతమును మరుద్వతి కెరింగించెను.

మార్కండేయుఁడు తలిదండ్రులసేవఁ జేయుచు, నగజాతనాథు ననుదినంబును ధ్యానించుచు సుఖంబుగఁ గాలంబుఁ గడపుచుండెను. ఆటలాడునప్పుడైనను, భుజించునప్పుడైనను, నిద్రించునప్పుడైనను నాబాలభక్తముఁడు గౌరీపతిని స్మరించుట మరువఁడయ్యెను. చిన్నతనంబుననే శివభక్తియలవడిన మృకండసూను నెంతయుఁ గొనియాడఁదగియున్నదిగదా!

క్రమక్రమంబుగ మార్కండేయునకు పదునేనువత్సరంబులునుదాఁట, మృకండుఁడును నాతనిసతియుఁ గంగాధరుని వరంబును దలఁచి చింతింపమొదలిడిరి. అంతఁ గుమారుఁడు తల్లిదండ్రులఁజూచి, "ఏల యిట్లూరక చింతించెదరు? పరుల వలనఁగాని నావలనఁగాని మీ రవమానభవించెనా? లేక

మఱేదయినఁ గొఱఁతయున్నదా?" యని యడుగ నాతనిమాతా పితలు "నాయనా! అనపత్యమువలనఁ గలిగిన దుఃఖమును సహింపఁజాలక యనేకవ్రతంబులొనర్చి, తుద కీశ్వరవరంబున నిన్ను గంటిమి" అని యాతని జననక్రమంబెల్లఁ బుత్రున కెఱింగించిరి. మార్కండేయుఁ డంత జననీజనకుల నుమ్మలికమ్ము నుడుగుఁడని చెప్పి తాను కరుణాసముద్రుఁడగు గరళకంఠు నారాధించి మృత్యువును జయింతునని పలికి తల్లిదండ్రులకుఁ బ్రదక్షిణపూర్వకంబుగ నమస్కరించెను. అంతట వారును దీర్ఘాయుష్మంతుఁడవు కమ్మని దీవించి "పుత్రా! నీవు వచ్చి మరల మాకన్నులకుఁ గన్పడునంతవఱకును మేము మిగుల వగచుచుందుము. ఈస్వల్పకాలమున నిన్ను విడుచుటకును మామనసము లొప్పకున్నవి. మృత్యువును జయించుటకై శివారాధనమున కరుగు నిన్ను నిలుపుటకును చిత్తములు సాహసింపకున్నవి. కావున నెట్లో బొందిని ప్రాణములునిలిపి నీకై నిరీక్షింతుము. కృతార్థుండవై వేగవచ్చి మాకు నేత్రోత్సవ మొనరింపుము" అని పలుక వారలుఁ [illegible] ధరింపవరిగెను.

అతఁ డట్లరిగి పుష్పగిరిపై నొకసైకతలింగమును నిలిపి నిశ్చలచిత్తమున "ఓ సర్వమంగళమయాంగా! నగజాలింగితార్ధాంగా! సచ్చిదానందస్వరూపా! సదాశివా! ఒక్కపరి నీ దివ్యసుందరరూప విలోకనమునకుఁ జూపి ధన్యునిఁజేయవా? నీకు నేను భక్తుఁడనుగానా! నీసేవ నే నెన్నఁడుమఱచితిని? మహా

మహాముద వల్పుఁడ నగు నన్నుఁ గాపాడుట నీకు భారమా ? కష్టమా ? దయాసాంద్రా ! నీకు నేను శత్రుకోటిలోనివాఁడనా ? కరుణ రాదా ? యని పరిపరివిధములఁ బ్రార్థించుచుండె.

ఇది యిట్లుండ యమలోకమున శమనుఁడు పెక్కండ్రు భటు లాయుధపాణులై తన్నుఁగొలువ ముఖ్యామాత్యుండగు చిత్రగుప్తునిచే జీవరాసుల యాయుర్దాయముల పరిమాణంబులను పాపపుణ్యంబులను నాలించుచు నరకసంపదఁ జూచి యోగ్యని కుజనులను బడియలచే మోదించుచు జీవహింసలఁ జేసిన క్రూరులపై సలసలకాఁగు తైలమును జల్లించుచు మాతాపితల కహితంబులొనర్చిన కష్టాత్ముల నగ్నికుండములఁ ద్రోయించుచుఁ దాముఁ దినక పరులకుఁ బెట్టక మధుమక్షికలమాడ్కి ధనంబుఁ గూడఁబెట్టి, తుదకుఁ జోరులకర్పించిన లోభులఁబట్టి మహావ్యాళంబులచేఁ గఱపించుచుఁ, బరులవిత్తంబుఁ దస్కరించిన తెక్కలికాండ్రు నగ్నికంబముల నాలింగనముఁ జేయించుచు బలిమిం బరకాంతలఁబట్టిన మోహాంధుల వజ్రదంష్ట్రలుగల శునకంబులచేఁ గఱపించుచు నగ్నివిషాదులవలన నొరుల యసువులఁగొనిన ముష్కరుల నినుపముక్కులుగల కాకిలచేఁ బొడిపించుచు, నమ్మినవారలకు ద్రోహముఁజేసిన దుండగీడుల జాలచే గొట్టించుచు, నింటికివచ్చిన యతిథుల నిరాకరించిన పాపుల, వృశ్చికంబులచేఁగుట్టించుచు, దైవకార్యములు చెఱపి మహామోదమునందిన ఘోరపాతకులఁ గ్రకచంబులచే హింసిం

వుచు, పనినమాటనుతప్పు చెనటులఁ గొరడాలతోఁ గొట్టించు
చు, దండనాధికారముఁ జేయుచు మార్కండేయుని యాయు
ష్కాలము నాఁటితో సరియగునని విని, భయంకరులగు కింకరు
లఁ గొందఱను మార్కండేయునిఁ గొనిరండని ముదలనొసఁగె.

అంతకునాజ్ఞానుసారము కింకరులు మార్కండేయునికడ
కరుదెంచి, "మునిబాలకా! మేము యమభటులము. మానేత
నిన్నుఁ దోడ్కొనిరమ్మని నియోగించితిమి. త్వరగరమ్ము. రా
కుంటివేని యీపాశములచే నిన్ను బంధించి తీసికొనిపోయెదము.
కాని విడువము. అలసించిన మాయొడయనికిఁ గోప మధికము
కాఁగలదు. సమవర్తి క్రోధంబున సామాన్యముగాద"ని పలుకు
యమభటులకు, మార్కండేయుఁడు నిర్భయముతో "అంతకు
నకుఁ గ్రోధానలం బధికమైన నతనిబంటులగు మీకు భయము
గాని నాకేల? మీతో వాదముచేయుట కిది యదనుగాదు.
తడవు మసల కేఁగ వేగ నవలకుం బొం"డని ప్రత్యుత్తర మిచ్చె
ను. అంత నాపరేత రాడ్భటు లుగ్రులై "నీదుండగ మడంచెద
ముండుము. కృతాంతుని వృత్తాంతము రవంతయైన నెఱుఁగక
మమ్మెదిరించిన శూలములఁ బొడుతుమ"ని పలుక, నామృ
కండుసంసనుఁడు పంచాక్షరీమంత్రపూతంబగు బూది యా
యమదూతలపైఁ జల్ల వారలు తిరిగిచూడక వేవేగ యమ
పురంబుఁ జొచ్చి, జరిగిన విషయమెల్లఁ గాలుని కెఱిఁగించిరి.

అంత నా దండధరుఁడు పటపటఁ బండ్లుకొఱుకుచు, మా
ర్కండేయునిఁ గొఱకు తాన బయలువెడలి శివభక్తి ధౌరేయుం
డగు వ్రభ్యాలునిఁ గాంచి, „ ఓరీడింభకా! నాయాజ్ఞను తిర
స్కరించి, నాకింకరుల నిరాకరింతువా? అంతకుఁడన నేమాయ
కుండని తలఁచి నాయాజ్ఞానతి నిర్లక్ష్యము చేసితివి కాఁబోలును!
ఇఁకనైన నాలసింపకరమ్మ"ని పలుక మార్కండేయుఁడు „ ఇం
తకు మున్నేతెంచిన కింకరులప్రభువు కాలుండైన నన్నేలువాఁడు
కాలాంతకుఁడు సుమా? భక్తులకు భద్రంబులొసంగు రుద్రుఁ
డుండ క్షుద్రుల యుపద్రవంబులకు భీతిల్లనేల? వెఱ్ఱివాఁడా!
శివునియాజ్ఞ లేకున్నఁ జీమయైనఁ గుట్టదను నార్యోక్తిని మఱ
చియుంటివా? అగ్నికొన్నఁడైనఁ జదలంటునా? ఆలసింపక సత్వ
రంబుగఁ బొమ్మ"న నక్కాలుండు „ ఓరీ మూర్ఖా! నీవు లింగ
మును నమ్మి భంగపడఁ జూచుచుంటివి. ఇట్టి లింగము లెన్ని
యైన నంతకు నంతమొందింపఁజాలవు. „ ఇనుమునుబట్టి యగ్నికి
సమ్మెటపోటు"లను నటులు నిన్నుఁగూర్చి యీలింగమునకుఁ
గూడ వేదనఁ గలిగింపవలసియుండును"ని తనచేతి పాశమును
గిరగిరఁ ద్రిప్పివైచెను.

అంతట మార్కండేయుఁడు „ మహాదేవా! శంభూ!
త్రిశూలధారీ! నిటలాక్షా! నీభక్తుని రక్షింపుము. ఈతఁడు
నిన్నును నన్నుఁగూడ దూషించి మనలనిరువురఁ బాశంబుచే
బంధించి బాధింప నున్నాఁడు. ఇప్పట్టునఁ గావకున్న నిఁక నాకు

దిక్కు వ్రయ్యలని మొఱలిడ భగభగయని పెనుమంటలు మింటి
కెగయ ద్వాదశాదిత్యులొక్కపెట్టున నుదయించినకరణి లోకం
బులనెల్ల దహింపఁజాలు కాలవహ్నిచందంబున నొక్కమహాతే
జముద్భవించెను. అంత నాలింగమధ్యమునుండి త్రిశూలధారి
యగు కాలాంతకుఁ డావిర్భవించెను.

ఇది యంతయుఁ గన్నులారఁ గాంచుచుండిన కాలుఁడు,
గజగజవణఁకఁ జొచ్చెను. భక్తవత్సలుండగు సర్వతోముఖుఁడు
యముని వీక్షించి, " ఏమిరా! నీకండకావరము? ఎద్దుబలిసి
యాఁబోతుపై అంకెవేసినట్లు నాచెంతనా నీబీరములు? తు
చ్ఛపదవియందున్నను మూఢునకు గర్వమధికము. ,, వినాశ
కాలే విపరీతబుద్ధిః " యనునటుల, నాదరిసత్వమును నీసత్వమును
గూడ నించుకైన నెఱుఁగక కాఱులఁ జెదవా? ఇట్టి లింగము
లెన్నియైనను నంతమొందింపఁ జాలవేమి? చూడు, నిన్ను
మడియించి భక్తులకు నీ పీడ లేకుండఁ జేసెదనని, శమను దీర్ఘ
నిద్రితునిఁ గావించి, మార్కండేయునిఁ గైలాసమునకుఁ దో
డ్కొని వెడలెను.

ఆహా! ఏమి, మార్కండేయుని భక్తిప్రభావము! అష్ట
దిక్పాలురలో నొకఁడైన యముని నిర్జీవితునిగఁ జేసినది!
అంతకుఁ డిట్లంతమొంద లోకమున నెక్కడఁజూచినను జననంబ
కాని, మరణంబు లేకుండుటచే భూదేవికి భారంబయ్యె. అంత
నద్దేవి వైకుంఠమున శ్రీవల్లభునిఁ జేరి, శబరునిచే శమనుఁ డంత

మొందుటాదిగాఁగల వృత్తాంతము సాంతముగ వినిపించి, దానఁ దనకు భారంబధికంబగుట తెలియఁబలికెను. మఱియుఁ దానా భారంబు భరింప దుర్భరంబనియు, నెట్లయినఁ గరుణించి శ్యామలాపతినిఁ బునర్జీవితునిఁ జేసి తనక్లేశంబు నివర్తింపఁజేయుమనియు ననేకవిధంబులఁ బ్రార్థించెను.

అంత జనార్దనుఁడు, "నేను కైలాసమున కరిగి సర్వజ్ఞు నొడంబఱిచి, పరేతపతిని బ్రదికించి నీ యాపదఁ బాపెదన''ని యామెను బంపెను. పిమ్మట శౌరి బ్రహ్మాదులతోఁగూడి శంకరునికడ కరిగి, "గంగాధరా! సమవర్తి యంతమొందుటవలన నిఁక జననంబేకాని మరణంబు లేకుండుటచే దురితాత్ములు, నిరాతంకముగ వర్తించుటకు సమయము చిక్కెనని నిర్భయముగ దుర్మార్గమునకుఁ గడంగుదురు. న్యాయాన్యాయవిమర్శనమును, వారలకుఁ దగు విధమున శిక్షలును లేకున్న ముప్పు వాటిల్లఁగలదు. దీనఁజేసి మన మువ్వురకుఁగూడ నిఁక ముందు శ్రమంబెక్కువ కాఁగలదు. కావున నిఁక నైనఁ గరుణవహించి శమనుని బ్రదికించి భూభారంబు నివారింపుమ''ని పలికెను. ఉమాకాంతుఁడు దయాసాంద్రుఁడై యందులకు సమ్మతించెను.

అనంతరము త్రిమూర్తులును మార్కండేయ సహితులై యముఁడు మృతుఁడై యున్న తావున కరుదెంచిరి. అపుడీశ్వరుఁడు వైకర్తనుఁ బునర్జీవితుం జేసె. యముఁడంత నిద్రనుండి మేల్కాంచినవానివలెఁ దిగ్గున లేచి, త్రిమూర్తులకు నా

నమస్కరించి, " మాయావృతుండవగు నేను, మాయాతీతులగు
మీమాహాత్మ్యంబు లెఱుఁగక చేసిన నాయపరాధమును క్షమిం
పుఁడ"ని బహువిధంబులఁ బ్రార్థించెను. త్రిమూర్తులును య
మునితో, ,, భక్తులు, పరోపకారులు, వేదాచార సంపన్నులు,
ధర్మమార్గానుసారులు, మాతృ పితృ వాక్యపరిపాలకులు, పతి
వ్రతలాదిగాఁగల పావనచారిత్రుల చెంతఁ జేరక, యసత్యవా
దులు దురాచారులు చోరులు మున్నగు దుర్మార్గులనుమా
త్రమే దండించుచు న్యాయపరిపాలనము సేయుచుందుము"ని
పెక్కు నీతులు బోధించిరి. యముండును వారియానతి తలఁ
దాల్చి నమస్కరించి నిజ నివాసమున కరిగెను.

ముక్కంటి మృకండు నందనుంగని ,, నీకిఁక యముని
వలన భయం బావంతయు లేదు. చిరంజీవివై యుండుము. లోక
ముల ననేకధర్మములఁ బ్రబలఁజేసి స్థిరకీర్తి నార్జింపుము. నీస
చ్చరిత్ర మాచంద్రతారార్కమై జగంబున వ్యాపించున"ని
పలికెను. పిమ్మట మార్కండేయుఁడు త్రిమూర్తులకును సా
ష్టాంగ నమస్కృతులాచరింప, వారలు మార్కండేయున కనేక
మంగళాశీర్వచనములఁ గావించి తమతమదిక్కులకుం జనిరి.

అనంతర మాబాలభక్తుం డపరిమితానందభరితుఁడై
యీశానుని స్మరించుచుఁ దనకై పరిపరివిధంబుల విచారసాగ
రంబున మునిఁగియున్న జననీజనకులఁ జేరి వారిచరణసరోజము
లకు సభక్తికముగ నెఱఁగెను. వారును పుత్రునిం గాఁగిలించు

కుని, "కుమారా! నేఁటికిఁగదా మాప్రాణములు కుదుటపడె ను. జరిగిన యావద్వృత్తాంతమును విన్నవింపవే!" యని యడి గిన తల్లిదండ్రులకుఁ దనయుఁడు తనశుభోదంతంబంతయుఁ దెల్పి యుమామహేశ్వరాంఘ్రియుగపంకజములయందు బుద్ధి నిల్పి, సుఖంబుగఁ గాలంబుఁ గడపుచుండెను.

అహా! జన్మించినదాది శివపూజాధురంధరుఁడై వెలసి, తుదకు తన మహాతపస్సంపన్నతచే శంకరునిఁ బ్రత్యక్షముగఁ జేసికొని, యకాలమృత్యువును జయించిన బాలభక్తుఁడగు మా ర్కండేయుని పావనచారిత్రమును పఠించు విద్యార్థు లెంతయు నుత్తములుగదా!

ఇక్కథ నెవ్వరేని శ్రద్ధాభక్తులతోఁ బఠించినను, విన్న ను, వ్రాసినను, వారియాఘంబులు బాయుటయేగాక, బాల భక్తుఁడగు మార్కండేయుని కరణి వారు దీర్ఘాయుష్మంతులై సౌఖ్యము ననుభవింతురు.

మార్కండేయచరిత్రము సంపూర్ణము.





శ్రీరామ.

# బాలభక్తులు

## 4. నందుఁడు.

కులము ప్రధానము గుణము లేకున్న
కలశాబ్ధిఁ బుట్టదే కాలకూటంబు.

ఆసి చిన్ననాఁ డభ్యసించినట్లు గుణము ప్రధానముగాని కులము ముఖ్యముగాదు. భగవద్భక్తి యలవడినవారెవరైనను మనిష్యులచిత్తమే యావశ్యకముగాని వర్ణమింపుకయు నగత్యములేదు. పవిత్రతావిధానముననుసరించి కేవల చండాలతుల్యులగువారలు విప్రులందును, ద్విజులతో సమానులగువారలు చండాలురయందును చెప్పఁబడగలరు. రాక్షసులందేమి బ్రాహ్మణులందేమి చండాలురయందేమి, భగవద్భక్తు లుద్భవించి ప్రకాశించినటుల మనము పురాణములయం దాలించుచునే యున్నారము.

నందుఁ డార్కాటుజిల్లాలోని ఆధనూరను చిన్నగ్రామమున రమారమి మూఁడువందల సంవత్సరములక్రిందట నొక

మాలలింట జన్మించెను. మాలపల్లెలు సాధారణముగ నూరికి దూరముగ నుండును. అవి మట్టితో నిర్మింపఁబడిన చుట్టుగుడిసెలతోను, మురికినందులతోను, పెంటపోగులతోను, శల్యసమూహములతోను, నింక ననహ్యకరములగు వస్తుజాలములతోను నిండి, చూచువారలకుఁ గడుపులోని యాంత్రము లీవలఁ బడునేమో, యనునంతటి మర్యాదనపూరితమైయుండుననుటలో సందియ మావంతయులేదు. సాధారణముగ మాలమాదిగలు దాస్యవృత్తి నవలంబించి జీవనముఁజేయుచుందురు. నందుఁడొక భూసురునిపొలమునఁ బనిసేయుచు జీవనముఁ గడపుచుండెను.

నందుఁడు చిన్నతనమునఁ దక్కిన చండాలబాలురవలెగాక నిరంతరము నీశ్వరభక్తితో వర్తిల్లువాఁడు. అతఁడు కొందఱుబాలుర వెంటఁ గొంపోయి, మృణ్మయవిగ్రహములఁ జేసి యవి దేవుఁడని యారోగింపుచు, నమస్కరించుచు నానందించెడువాఁడు.

ఆయూరను బ్రాహ్మణగృహముల కనతిదూరమున రమణీయమైన గోపురముతో నొప్పు నొక శివాలయముగలదు. నందున కా గోపురమునఁ బ్రీతియెక్కువ. నందుఁడు మాలవాఁడగుటచే దూరమునందుండియే యాగోపురసౌందర్యముఁ దిలకించుచు సంతసమందువాఁడు. గ్రామమందు జరుగు శివుని యారోగింపు టుత్సవములను దూరమందుండియే చూచి యా

తఁడు పరమానందభరితుఁ డయ్యెడువాఁడు. భగవదాలయము లన్నను బ్రాహ్మణులన్నను నందునకుఁ గలభక్తి యనిర్వచనీయము.

తా నధమకులజుఁడననియు నిఱుపేదననియు నెట్టి కైంకర్యముచే భగవంతుని మెప్పింతుననియు నొక్కొక్కతఱిని నందుఁడు చింతించువాఁడు. భగవంతునిదగ్గఱ వాయించు వాద్యములకుఁ గావలసిన చర్మములఁ దాను స్వయముగఁ దెచ్చి శుభ్రపఱచి యుచితముగ వాద్యములఁ జేయువారి కొసంగుటయే సత్కార్యమని వానికిఁ దోఁచి యట్లొనర్చువాఁడు. తోడిమాల బాలకులతోఁ గలిసి నందుఁడు శరీరమునిండ బూది పూసికొని, భగవత్కీర్తనలఁ బాడుచు భజనల జేయుచుండువాఁడు.

నందుఁ డొకనాఁడు తన యజమానునివని ముగియునిదే తోడిబాలుర వెంటఁగొని, సమీపమునఁగల తిరుపంకూరను గ్రామమునకుఁ బోయెను. దాని నిప్పుడు "ప్రాతవైతీశ్వరం కోయిల్" యని పిలుచుచుందురు. నందుఁ డాయూరఁ బ్రవేశించి యాపాదమస్తకము భస్మము పూసికొని, గ్రామమునకు బ్రదక్షిణములఁ గావించి యాలయమున కెదురుగనిలిచి, శివుని భజించి సాయంకాలమునఁ గదళీఫలములను నారికేళఫలములను దేవునకు నివేదనము చేయుమని యర్చకున కర్పించెను. అర్చకుఁ డాలయ మలంకరించి, సాయంకాలము పూజసేయుచుండ, నాలయముబైట ధ్వజస్తంభము వెనుకనుండియే, యాగుడియందలి

గంటానినదమును భక్తుల శంఖధ్వనులను విని నందుఁడందిన మ
హానందము నేమని వర్ణింపవగును? గర్భాలయములోనికిఁ జొ
చ్చియున్నను, జనసమ్మర్దముచే దేవునిదర్శనము కాకపోవుచుండ
శివాలయము వెలుపలనుండి ధ్వజస్తంభము వెనుకనుండి, దేవు
నివైపు చూచు నందునకు మాత్రము దర్శనమెట్లగును? పాప
మాచండాలబాలుఁడు వంగివంగి తెప్పవాల్పక పలుసారులు
చూచి, భగవద్దర్శనమయ్యెనని పరమానందముచే భక్తిపరవశ
త్వమున మూర్ఛిల్లెను.

మార్గమునఁ బోవువార లదిచూచి వానిచుట్టును జేరి
యబ్బాలభక్తుని సునిశ్చలభక్తి కెంతయు నబ్బురపడసాగిరి.
ఆబాలుని భక్తికి మెచ్చి శివుఁడు తనవిగ్రహము వానికి చక్కఁ
గఁ గన్పడవలయునని, తన కెదురుగనున్న నందివిగ్రహమును
ప్రక్క కుండునట్లుగాఁ జేసెనఁట. ఆహా! ఏమి, యాచండాల
బాలభక్తుని భక్తిప్రభావము! ప్రతి శివాలయమునందును శివుని
కెదురుగనుండు నందివిగ్రహము తిరుపంకూరులో దేవుని కెదురు
గనుండక, యింకను నొకప్రక్కకే యుండునట్లు చేసినది!

కొండొకతడవునకు నందుఁడు లేచి తనచుట్టును గుంపు
లుగనున్నవారి కెల్లరకును నమస్కరించి, మరల నొకపరి గ్రా
మమునకుఁ బ్రదక్షిణముఁ జేయవలయునని తోడిమాలబాలకు
లతో బయలువెడలెను. అట్లాతఁడు పోవుచుండ నొకచోట
భూసురశ్రేష్ఠుఁ డొకఁడు చిదంబరపురాణముఁ జెప్పుచు [illegible]

నుతుప్రమండెను. "చిదంబరము గొప్పక్షేత్రము. దానిని మించిన గొప్పక్షేత్ర మింకొకటి లేదని చెప్పవచ్చును. అది దక్షిణహిందూస్థానములోని దివ్యస్థలములలోకెల్ల వన్నెకెక్కినది. అందు శివుని యాకాశలింగ మున్నది. దక్షిణదేశమునఁ బృథివి లింగము, జలలింగముఁ, దేజోలింగము, వాయులింగముఁ గల క్షేత్రములు నాలుగుగలవు. పంచభూతములలో నాకాశకళా దానిరూపము గ్రహించి శివుఁ డాకాశక్షేత్రమున నుండె నని ఋషులు చెప్పుదురు. చిదంబరాలయమధ్యమున బంగారు రేకులతో కప్పఁబడిన కనకమండపములో నటరాజస్వామి విగ్రహము మరియు నవిగ్రహము శాశ్వతమైనను నేత్రపర్వము గుండునట్లు చిత్రింపఁబడి యున్నది. దానియందముఁ గాంచవలయు నేగాని వర్ణింపనలవికాదు. నటరాజస్వామి కోవెలదగ్గరనే గోవిందరాజపెరుమాళ్ళ దేవాలయము నుండుటచేఁ జిదంబర మన్నిమతములవారికిఁగూడ సేవింపఁదగినదే."

అవనీసురుఁడు పలికిన మాటలు నందుని కమృతధారలవలె నుండెఁ. బరమానంద భరితుఁడై, నాఁటిరాత్రియే బయలుదేఱి వెళ్ళి యా పావన క్షేత్రముఁ గాంచవలెనని దృఢసంకల్పుఁడయ్యెను. కాని యజమానుఁడగు విప్రుని యాజ్ఞఁ గైకొనకయే పోవచ్చునా యని తలఁచి, బ్రాహ్మణుని యనుమతికై వెడల నిశ్చయించి, నందుఁడును నతని మిత్రులునుగలసి పరోపకారార్థ మాయూర నొకకోనేఱుఁ ద్రవ్వ ప్రారంభముఁ జేసిరి.

రమాకమి యొక్క నెలదినములకు పూర్తిఁగావింపవలసిన కోనేటి
పని నత్యల్పకాలముననే నెఱవేర్చు టత్యాశ్చర్యముఁగదా! నిశ్చ
లభక్తు లేకార్యమును జేయలేరు?

నందుని చిత్తము నటరాజస్వామి తన యెదుట నృత్య
ముఁ జేయుచున్నట్లు సంతసింప సాగెను. చిదంబరమును జూడ
ననుజ్ఞ వేఁడినచో యజమానుఁ డాగ్రహించునేమో యని,
నందుఁడు బ్రాహ్మణునితో నేమియు ననకఁ దనలోఁ దాను
జింతించుచు నూరకొనుచుండువాఁడు. నందుఁడు తనకులము
వారొనర్చు సురాపానమాదిగాఁగల దుష్కార్యములఁ జేయ
కుంటయేగాక నట్టిచెడుగుపనులఁ గావించువారల నట్టిపనులఁ
జేయరాదనికూడ నొక్కి వక్కాణించు చుండువాఁడు. కుజం
బులను నికుంజపుంజములను నదీప్రవాహములను వేయేల! కం
టికి కనఁబడు వస్తువుల నన్నిటిని, నటరాజస్వామి స్వరూపము
లేయని మదిఁ దలఁచి యానందించుచు, వేగ దర్శన మొసఁగు
మని నందుఁడు సదా నటరాజస్వామిని ధ్యానించు చుండెడు
వాఁడు.

భక్తిరసాధిక్యముచే నానందబాష్పములఁ గార్చుచు, నం
దుఁ డొకనాఁడు మైమఱచి పడియుండఁ గులస్థులుచూచి వాని
శరీరముఁ గదిపి చూచిరి. అంత నందుఁడు లేచి చూచెను.
చుట్టునున్న మాలలందఱు నిట్లేలపడితివని నందునిఁ బ్రశ్నింప
నిశ్చలచిత్తమునఁ బరమేశ్వరుని స్మరించుచు నొడలు తెలియక

పడియుండెనని ప్రత్యుత్తర మొసఁగెను. వారికాపలుకులు వికా
రముగాఁ గన్పట్టకపోవుటచే మాలపెద్దలందఱు సభఁ గావించి,
కులదేవతలకుఁ దగినజాతరలు సలుపకుండుటయే యందులకు
గారణముగాని మఱియొండుగాదని యూహించి జాతరలఁ జేయ
సాగిరి.

నటరాజస్వామిని దర్శింపవలయునని నందునకుఁ గలమ
నోరథ మంతకంత కెక్కుడై యజమానుఁడగు నవనీయురుని
సెలవడుగుటకై ప్రోత్సహించుచుండెను. నందున కుద్భవించిన
దున్మాదముగాని దైవభక్తి కాదని గట్టితలంపుతోనున్న మాల
పెద్దలెల్లఁ జిదంబరమునకుఁ బోవుటకై నందునకు సెలవీవలదని
బ్రాహ్మణునిఁ బ్రార్థించిరి. అతఁ డందులకు సమ్మతించెను.

ఒకదినమున నందుఁడు యజమానునిఁ జిదంబరమునకుఁ
బోవుటకాజ్ఞయిమ్మని మెల్లగ నడుగఁ “ చండాలునకుఁ జిదం
బరయాత్రయా ? సెలవీయను. మాఱుమాటాడకుము” ని కో
పమునఁ బలికి తనయసమ్మతినిఁ జూపెను. నందుఁడంతట నొక
నిర్జనప్రదేశమునకుఁ బోయి కూర్చుండి, “ పరమేశ్వరా !
నీ వెంత కరుణాహీనుఁడవైతివి ! . ఇంకను నీదర్శన మొసంగ
కుండుట కేనొనర్చినయఘ మేమి ! నేఁడు తుచ్ఛుఁడనియుఁ జం
డాలుఁ డనియు నిరుపేదయనియు యకన్వాంద్రుఁడు కాఁడని
యు నీదర్శనముఁ జేయనర్హుఁడనియుఁ దలఁచి యజమాని హృ
దయమందుఁ బ్రవేశించి సెలవీకుండ నొనర్చితివా ? ఇఁక నాకి

వితమేల? మరణించియైన నీసన్నిధిఁ జేరెద"నని పలుకుచు నా
త్మహత్యఁ జేసికొనఁదలంచి, కొండొకతడవాలోచించి మరల నా
ప్రయత్నముఁగూడ విరమింపఁజేసి „ ఆహా! నేనెంతమందమ
తిని! ఎట్టి నీచకృత్యముఁ జేయ సాహసించితిని! యజమాను
నాజ్ఞానుసారము మెలఁగకుండిన నాపైన నటరాజస్వామికనుగ్ర
హము కలుగునా? ఏనాఁ డాస్వామికి నాపైఁ గరుణోదయం
బగునో యానాఁడే నాయొడయుఁడు చిదంబరయాత్రకు నాకాజ్ఞ
యొసంగు"నని తలంచి గ్రామముఁ జేరెను.

ఒకకార్యమునకై వేచియున్న వానిహృదయమున కెప్ప
టికైన నాపని నెఱవేఱువఱకును నిలుకడ యుండునా? కతిపయ
దినంబులకు నందుఁడు చిదంబరయాత్రకై వెండియు విప్రుని
సెలవునకై కరంబుదీనుఁడై ప్రార్థించెను. కాని యజమానుఁ
డగు భూసురునకింక ననుగ్రహము కలుగదయ్యెను. తా నిం
కను నటరాజస్వామి దర్శనముఁ జేయ నసర్హుఁడనుగాఁ బోలునని
నందుఁడు చింతించి, సర్వకాలసర్వావస్థలయందు నీశ్వరధ్యాన
ము సేయుచుండియు మఱియొక నేత్రములకు గోచరమగు ప్రతిజీవియు
నీశ్వర స్వరూపమేయని దృఢమనస్కుఁడై యున్నందున, నొ
క్కొక్కప్పుడు వృక్షములఁ గౌఁగిలించుకొనుచు, మఱియొక
ప్పుడు మృగములవెంట బరుగులిడుచుండెడువాఁడు.

నందుఁ డిట్లుండుటచే నతని కులమువారెల్ల నిక్కముగ
నందునకుఁ బిచ్చియెత్తినదనియు నది దినదినాభివృద్ధి నొందుచుండె

వినియు నిశ్చయాత్ములై, వానిని శృంఖలా బద్ధునిం జేసి బా
ధింపఁజొచ్చిరి. ఆహా! కరచరణంబుల బంధించి వారెంత హిం
సించినను, నందుఁడు వారల నించుకయుఁ బరుషవాక్యముల
నొప్పింపక, నది యెల్ల నీశ్వరవిలాసము కాని యన్యము కాదని
తలఁచి భగవంతుని స్మరణముమాత్రము మఱవఁడయ్యెను.

యజమానుఁడగు బ్రాహ్మణుఁ డొకనాఁడు నందునితో
"నందా! నీవును నీబంధుగుంపునుగలసి చేనుగోసి కుప్పవేయుఁ
డు; నీకు చిదంబరయాత్రకై సెలవిచ్చెద" ననెను. తోడనే
నందుని కొక్క దేవతాసాహాయ్యము ప్రాపించి బ్రాహ్మణుఁడు నియో
గించిన పని, స్వల్పకాలములోఁ దా నొక్కఁడే నెఱవేర్చి యజ
మానుని కానుకయు మెప్పించెను. అంత నాబ్రాహ్మణుఁడు
క్షేత్రమునకుఁ బోయి చూచి యాశ్చర్యహర్షణములు ముప్పిరి
గొన, "నందా! నీవొక్కఁడ వింతస్వల్పకాలమున నీపని
ముగించుటఁ గన నీవు పరమభాగవతోత్తముఁడవని స్పష్టమగు
చున్నది. భక్తులకు సాధ్యముకానిపని లేదుగదా! దైవభక్తుండ
వగు నిన్నింతవఱకును వివేకహీనుఁడనై నిర్బంధపఱచుకొని వేదన
పాల్జేసినవారలే పిచ్చివారలు. శ్రీలభక్తుఁడవగు నిన్ను బానిస
గ నొనర్చి నే నెంత పాపౌఘమున మునింగియుంటిని! నేఁటి
నుండియు నేను నీదాసను. నన్ను రక్షింపుమని భగవంతునితో
మనవి సేయుము. ఇదే నీకు నానమస్కారము. చిదంబరమునకు
వెడలుము" ని పలికెను.

భక్తులను బరీక్షించుటకు భగవంతుఁ డొక్కొక్కతరి దుర్భరకష్టపరంపరఁ గల్పించినను నునిశ్చలభక్తి ననవరతము భగవంతుని స్మరించు మహాభక్తులకుఁ గొనసాగనికార్య మెద్ది కలదు ! చిదంబరమునకు నందుఁ దరుగుచుండ శాస్త్రిహ్మణుఁ డాతనిఁ గొంతదవ్వు సాగనంపి, పరిపరివిధంబుల నాతనిఁ గొని యాడుచు విడువలేక విడువలేక నెట్టకేలకు నందుని విడిచి వెనుకకు మఱలెను.

నందుఁడు నటరాజస్వామిని హృదయమందు ధరించి స్మరించుచు, భక్తిరసబంధురమగు పాటలఁ బాడుచు నిరుపమాన భక్తిరస ముప్పొంగుచుండఁ, జిదంబరమునకుఁ బోవుసమయమున ధరణీతలం బదరెనఁట. కుజంబు లల్లాడెనఁట. స్వల్పకాలములో నూఱుపుట్ల నేలలోనున్న చేనుగోసి కుప్పవైచిన బాలభక్తుఁడగు నందున, కాధనూరినుండి కావేరీనదివంటిపాయయగు కొల్లడమునకుఁ ద్వరితగతి నరుగుచుండెను! కొల్లడము నది ప్రవాహపూరితమై చూచువారలకు నేత్రోత్సవముఁ జేయుచుండెను. నందుఁ డాప్రవాహపుఁదురవడిఁ గాంచి యందు భగవంతుఁ డుండెనని యుబ్బి గంతులు వైచుచుండెను.

అంత నొకనావ యచటికిరాఁగ నందుఁడు కేవునిచ్చుట కొప్పుకొని నావనెక్కి నటరాజస్వామిని స్తుతించుచు నందు నృత్యముఁ జేయనారంభించెను. నందునిన్నృత్యముఁ జూచి నావలోనివారెల్లరు నర్తనమాడఁజొచ్చిరి. ఇదంతయుఁ జూచుచుండిన

నావికుఁడు తెడ్డొకమూలఁ బాఱవైచి నాట్యమాడఁ బ్రారంభించెను. నదిమీఁద నావ నాట్యమాడుచు నెవ్వరును నడపకయే యత్యంతశీఘ్రముగ గమ్యస్థానముఁ జేరెను. అహా! ఇది యంతయు నందుని భక్తిప్రభావమే కదా!

నందుఁడు నావవానికి రేపియుఁబోవ నావికుఁడు రేవు వలదని నందు ననేకభంగుల స్తుతించెను. అందఱును నావదిగి నందునితోఁగూడ బయలుదేఱిరి. ఎదురుగఁ గనఁబడుచున్న చిదంబరగోపురముఁ జూచుచు నందుఁడందిన యానందమునకు మేరలేదు. వారందఱుఁ జిదంబరక్షేత్రముఁ జేరి భక్తియుతముగ కీర్తనలఁ బాడుచు గ్రామప్రదక్షిణ మొనరించిరి.

చిదంబరాలయమునకు బ్రాహ్మణగురువులు మూఁడు వేలవఱకును గలరఁట. వారలు నందుని వక్త్రికామరసమున నొప్పుచున్న బ్రహ్మజ్ఞానమును, వానియందుఁ బ్రకాశించుచున్న యీశ్వర తేజంబును బాగుగఁ దిలకించి నందుఁడును దోడివారును బాడుచున్న భక్తికీర్తనల నాలించిరి. చిదంబరముఁ జేరినది మొదలు నందుఁడును వానితోఁగూడ నున్నవారును గలిసి మూఁ డహోరాత్రములు నృత్యముఁ జేయుచు భగవత్కీర్తనల బాడిరి. మూఁడవనాఁటిరాత్రి చిదంబరములోని బ్రాహ్మణగురువులకందఱకు నొక్కరీతి స్వప్నమే కలిగెనఁట. అందు నటరాజస్వామి కనఁబడి నందుఁడు మాలవాఁడైనను బాలుఁడైనను మహాభక్తుఁడు కావున వాని ననలస్నానముఁ జేయించి

బ్రాహ్మణోత్తమునిగఁ జూడవలయునని చెప్పెనఁట. మఱునాఁడు బ్రాహ్మణగురువులందఱు వారివారిస్వప్నములఁగూర్చి యొకరి తోనొకరు చెప్పుకొని యబ్బురపడసాగిరి.

వారందఱు నంతటఁ బవిత్రాగ్ని నిర్మించి నందునితో తమ స్వప్నవృత్తాంతములఁ జెప్పి నమస్కరించిరి. అపుడు నందుఁడు వారితో నగ్నిసన్నిధిఁ జేరి నటరాజస్వామిని స్మరించు చు నగ్నిహోత్రముఁ బ్రవేశించి, జలంబున మజ్జనమాడిన వానికరణి నట్టిబాధయునొందక నీవలకువచ్చెనఁట. బ్రాహ్మణ గురువులు విస్మయమొంది నందుని చరణసరోజములకు వందన సహస్రము లాచరించి, యనేకరీతులఁ గొనియాడి, స్వచ్ఛమైన యవనీసురునిగ భావించి, నటరాజస్వామిసన్నిధికిఁ గొంపోయిరి. నటరాజస్వామిని సంపూర్ణముగ దర్శించినప్పుడు తనమనోరథము తీరినదని నందునకుఁ గలిగిన యానంద మింతయని నుడువ సర్వ భూతాంతర్యామియగు నాపరాత్పరునికేగాని యన్యుల కెవరికి శక్యమగునని యనుటయం దతిశయోక్తి లేదు.

స్వర్ణమండపమున గంటానినదము జరుగుచుండ నందుఁడు నటరాజస్వామిని నేత్రోత్సవముగఁ జూచుచు ధ్యానించుచుఁ బాడుచు నటరాజస్వామి నాలింగనముఁ జేసికొనెను. ఆసమయ మున నావైచిత్ర్యముఁ గనువారెల్ల రాశ్చర్యమంద నందుఁడు నటరాజస్వామిలో నైక్యమై ముక్తిఁ బడసెనఁట. బ్రాహ్మ

గురువు లంతట నటరాజస్వామితో, “స్వామీ ! నందుఁడు నీకుఁ బరమభక్తుఁడగుటవలనఁగదా వాని చండాలత్వముఁ బాపి నీతో నైక్యముఁ జేసికొంటివి ! మహానటుఁడవగు నీవు పరమ దయామయుఁడవు ! ఏకులంబున జన్మించిననేమి ? పెద్దవాఁ డైన నేమి, బాలుఁడైన నేమి ? భక్తి యొక్కటియే ప్రధానము. నిష్కల్మషభక్తియుక్తులకే ముక్తి సులభమని తెలుప నిట్లొనరించితివి. నంతరము నీవే మాకుగతియని నమ్మియున్న మాకెన్నఁడు ముక్తి నొసంగుదువో !” యని పలికిరఁట.

ఆహా ! జాతులన్నిటికంటె నీచమైనకులమునం దుదయించియు, లేఁబ్రాయమునుండియు నీశ్వరధ్యానమునందే కాలముఁ గడపి, భగవత్కృపవలనఁ దన చండాలత్వముఁ బోగొట్టుకొని, స్వచ్ఛమైన బ్రాహ్మణత్వముఁ బడసి, తన్నెఱిఁగినవారినెల్లర భక్తులుగ నొనర్చి, తుదకు నటరాజస్వామిలో నైక్యమై ముక్తి నొందిన యీ బాలభక్తునిచారిత్రమకరందముఁ గ్రోలు విద్యార్థి మధుపము లెంతటి ధన్యమైనవి !

“భగవద్భక్తునకు వర్ణభేదముతో నవసర మావంతయు లేదు. అతఁడు శాస్త్రముఁ జదువనక్కఱలేదు. ధనవ్యయమును జేసి గంగాది పావనస్రవంతుల కరిగి మజ్జనంబాడఁ బనిలేదు. దానధర్మము లెవరికిఁ జేయ నగత్యములేదు. నిష్కల్మషభక్తి యొక్కటియే భగవంతుని వశపఱచుకొనుటకు సాధనము

మోక్షమునకు మూలమైన భక్తి యొక్కటియే మర్త్యు నుద్ధరించునది.

ఈ పవిత్ర చరిత్రఁ జదివినను, వినినను, వ్రాసినను మనోవ్యాధులెల్లఁ బటాపంచలై సకల సౌఖ్యములు గలుగుఁ గాక !

సంపూర్ణము.



